శ్రీ

# ఘటికాచల మాహాత్మ్యము

## బ్రహ్మకైవర్త పురాణాంతర్గతము



శ్లో॥ సుధావల్లీ పరిష్వంగ సురభీకృత వక్షసే
ఘటికాద్రి నివాసాయ శ్రీనృసింహాయ మంగళమ్.

రచయిత

మామిళ్ళపల్లి నరసింహం

# శ్రీ ఘటికాచల మాహాత్మ్యము

రచయిత:మామిళ్ళపల్లి నరసింహం
ప్రథమ ముద్రణము - 1997 - 2000 కాపీలు



ప్రతులకు
**M.NARASIMHAM B.Sc (Hons)., B.Ed.,**
Plot No.24 Lakshminarasayya
New S.B.I.Colony
Behind Housing Board.
**ANANTAPUR - 515001** (A.P.)
✆ : 21663

This book is published with the financial assistance of TIRUMALA TIRUPATI DEVASTHANAMS under the AID To ATHOURS SCHEME.

మూల్యము : రూ. 30/-

ముద్రణ :
✆ : 31575
శ్రీ లక్ష్మీగణపతి బైండింగ్ వర్క్స్,
మెయిన్‌రోడ్డు,
కొవ్వూరు - 534 350

# ముందు మాట

శ్రీ ఘటికాచల దైవములగు శ్రీ యోగ నరసింహస్వామి, శ్రీ అమృత ఫలవల్లి, శ్రీ ఆంజనేయస్వామి మాకు గృహదైవములు. వేద సంహితలో గృహదైవములను తప్పక ప్రార్థింప వలయునని చెప్పబడియున్నది.

**"యోవై స్వాం దేవతా మతి యజతే ప్రస్వాయై దేవతాయై చ్యవతే న పరాం ప్రాప్నోతి పాపీయాన్ భవతి ॥**

అనగా గృహదైవముల పూజింపక పోయిన ఇతర దైవములు వానిని ఆదరింపరు. పరము చేకూరదు. పాపి యగును.

నేను పై దేవతల ప్రీతికరముగ "సువర్ణమాల" అను నరసింహ శతకమును, "శ్రీసతీ శతక" మను లక్ష్మీ శతకమును, "జీవన్ముక్తి మార్గము" అను సీతా రామాంజనేయ శతకమును రచించి నృసింహున కంకితము చేసితిని.

శ్రీ నరసింహ స్వామిని గురించి చెప్పు ముఖ్యమైన ఉపనిషత్తులు మూడు కలవు.

**1. శ్రీనృసింహ పూర్వోత్తర తాపనీయ ఉపనిషత్తు :-**

ఇందు పూర్వతాపినిలో శ్రీ నృసింహ అనుష్టుప్ మంత్రరాజము, ఋషి, ఛందస్సు, శక్తి, బీజము, కీలకము చెప్పబడినవి. అంగమంత్రములైన ప్రణవము, సూర్య అష్టాక్షరి, కాలకర్ణి, నృసింహగాయత్రి మొదలగునవి చెప్పబడినవి. తనూ మంత్రములు చెప్పబడినవి. సుదర్శన యంత్రము వివరింపబడినది.

**2. షట్చక్రోపనిషత్తు :-**

బ్రహ్మాండములోని అచక్రసుచక్రాది నారసింహషట్ చక్రములు, నృసింహ గాయత్రి మంత్ర జపవిధానము చెప్పబడినవి.

**3. అవ్యక్తోపనిషత్తు :-**

శ్రీ నృసింహ అనుష్టుప్ మంత్రమునుండి జగత్తు సృష్టింపబడిన దనియు, మనోయజ్ఞముచే అహంకారమును తొలగించుకొన వలెననియు చెప్పబడినది.

శ్రీ నృసింహస్వామిని యాంత్రికులు

ఎ. స్తంభోద్భవ నారసింహము

బి. పంచముఖ నరసింహము

సి. అష్టముఖ గండభేరుండ బడబానల జ్వాలా నృసింహము.

డి. లక్ష్మి నృసింహము

4. శ్రీ రాముని గూర్చి శ్రీరామపూర్వ ఉత్తర తాపనీయ ఉపనిషత్తు, రామరహస్యోపనిషత్తు వర్ణించుచున్నవి.
5. శ్రీలక్ష్మీదేవిని గురించి సౌభాగ్యలక్ష్మి ఉపనిషత్తు, ఇతర దేవీ ఉపనిషత్తులు తెలుపుచున్నవి.
6. పరాశర సంహితలో హనుమంతుని మాహాత్మ్యమును గూర్చిన కథలు మంత్రములు కలవు.

నేడు పై విద్యలను మంత్రములను గురుముఖముగా ఉపదేశమును పొంది జపించువారు అరుదు.

అందువలన సామాన్యుల కుపయోగ పడునట్లు, శ్రీఘటికాచలమున కరుదెంచు సేవార్థులు నిత్యపారాయణము చేయుట కుపయోగ పడునట్లు, వ్యాసమహర్షి రచించిన బ్రహ్మకైవర్త పురాణములోని ఘటికాచల మాహాత్మ్యమును సులభశైలిలో తెలుగున వ్రాసితిని. ఇందులో శ్రీ నృసింహస్వామి స్తోత్రము, కవచము, అంగదేవతలైన ప్రణవము, సూర్యుడు, లక్ష్మి స్తోత్రములు, హనుమంతుని స్తోత్రములు అనగా పై ఉపనిషత్తులలో చెప్పబడిన దేవతల స్తోత్రములు కలవు. కావున పై ఉపనిషత్తుల పారాయణము వలన లభించెడి ఫలము ఈ ఘటికాచల మాహాత్మ్యమును పఠించుట వలన కలుగును. ఈ గ్రంథమును పై ఉపనిషత్తుల ప్రతిబింబ మనవచ్చును. గిరిప్రదక్షిణ విధానము, తీర్థముల మహిమ ఇందు చెప్పబడినవి. శ్రీ ఘటికాచలమున సప్తఋషులు శ్రీ నరసింహ సుదర్శన యంత్రమును ప్రతిష్ఠించిరని చెప్పుదురు. గిరిప్రదక్షిణము చేయుటవలన యంత్ర ప్రదక్షిణము చేసినట్లగును. శ్రీ నారసింహసుదర్శన యంత్రమే శ్రీ చక్రమునకు సమానమని Sir John Woodroff చెప్పియున్నారు. ఈ గ్రంథములో గల కథలు స్తోత్రములు చదివినవారికి శ్రీ నరసింహస్వామి, శ్రీ అమృతఫలవల్లి, శ్రీ ఆంజనేయ స్వాములయందు భక్తి ఏర్పడగలదు. తద్వారా వారి అనుగ్రహము వలన కోర్కెలు నెరవేరగలవు.

ఇది గాక రామరహస్యోపనిషత్తులో భక్తవత్సలుడగు హనుమంతుడు భక్తుల ఐహిక వాంఛలను తీర్చెదనని ఇట్లు తెలిపెను.

**శ్లో॥ ఐహికేషు చ కార్యేషు మహాపత్సు చ సర్వథా**
**నైవ యోజ్యో రామ మంత్రః కేవలం మోక్ష సాధకః**
**ఐహికే సమనుప్రాప్తే మాం స్మరే ద్రామ సేవకమ్.**

అనగా "మోక్షము నొసగు శ్రీరామమంత్రమును ఐహికమైన కార్యసాధనకు ఉపయోగింపకుము. ఐహిక కార్యసిద్ధికి రామసేవకుడనైన నన్ను స్మరింపుము."

అని ఆంజనేయ స్వామి అభయమిచ్చెను. శంఖచక్రధారియైన శ్రీ ఘటికాచల ఆంజనేయస్వామి అసాధ్యకార్య సాధకుడు. అసాధ్య మనునది హనుమంతునకు లేదు. దయా సముద్రుడు, రామదూత అగు హనుమంతుని సేవించిన మన కోర్కెలు నెరవేరును. ఈ పురాణమున శివకేశవ అభేదము సూచింప బడినది.

ఈ పుస్తకమును ఆంధ్రీకరించుటలో తోడ్పడిన విద్యారణ్య ఓరియంటల్ హైస్కూలు సంస్కృత అధ్యాపకులు శ్రీ వాసుదేవ శాస్త్రి గారికి నా కృతజ్ఞతలు తెలుపుకొనుచున్నాను.

భక్త రక్షణ దీక్షను బూనిన శ్రీ ఘటికాచల దైవములకు నమస్కారము.

ఇట్లు
మామిళ్ళపల్లి నరసింహం

**పారాయణ విధానము :**

ప్రతిదినము ధ్యాన శ్లోకమును చదివి, నృసింహ అష్టోత్తర శతనామములచే పూజించి, నైవేద్యము పెట్టి, ఒక అధ్యాయము చొప్పున గ్రంథ పారాయణము చేయవలయును.

ధ్యానము

**శ్లో॥ సత్యజ్ఞాన సుఖస్వరూపమమలం క్షీరాబ్ధి మధ్యేస్థితం**
**యోగారూఢ మతి ప్రసన్నవదనం భూషా సహస్రోజ్వలమ్,**
**త్ర్యక్షం చక్ర పినాక సాభయ వరాన్ బిభ్రాణ మర్కచ్ఛవిం**
**ఛత్రీభూత ఫణీంద్ర మిందు ధవళం లక్ష్మి నృసింహం భజే.**

**శ్లో॥ లక్ష్మీచారు కుచద్వంద్వ కుంకుమాంకిత వక్షసే,**
**నమో నృసింహ నాథాయ సర్వమంగళ మూర్తయే.**

ధూప, దీప నైవేద్య, తాంబూల, నీరాజనాని సమర్పయామి.

శ్రీ నృసింహ అష్టోత్తర శతనామావళి

శ్రీ

# ఘటికాచల మాహాత్మ్యము

## (బ్రహ్మకైవర్త పురాణాంతర్గతము)

ధ్యానము

శ్లో॥ శ్రీ వత్సాంచిత వక్షమధ్య విలసత్ శ్రీ కౌస్తు భోద్యన్మణిః
ప్రాచీనోక్తి విలాసినీ ప్రవిలసత్ శ్రీమంత ముక్తామణిః,
శశ్వత్ సేవకచిత్త జాడ్య తిమిర ప్రచ్ఛేదన ద్యోమణిః
పాయాన్నో ఘటికాద్రి శేఖరమణిః సంకల్ప చింతామణిః.

శ్లో॥ సప్త సప్తసు లోకేషు లోక లోక చరా చరే,
నాస్తి నాస్తి సమం క్షేత్రం ఉత్తమం ఘటికాచలమ్.

14 లోకముల యందును శ్రీ ఘటికాచల క్షేత్రమునకు సమానమైన క్షేత్రము లేదు.

అంకితము

గృహదైవమైన శ్రీ ఘటికాచల లక్ష్మీనృసింహస్వామి
పాదారవిందములకు

రచయిత

మామిళ్ళపల్లి నరసింహం

ఓం నమో నారసింహాయ

# శ్రీ ఘటికాచల మాహాత్మ్యము

## మొదటి అధ్యాయము

శ్రీ వ్యాస మహర్షి 18 పురాణములు రచించెను. వానిలో బ్రహ్మకైవర్త పురాణ మొకటి. అందులో ఉత్తర ఖండమున భృగు పరాశర సంవాదరూపమున శ్రీఘటికాచల మాహాత్మ్యమును వ్యాసుడు రచించెను.

పరాశర మహర్షి ఇట్లు తెలిపెను. పూర్వము సనకాదులైన దేవఋషులు చేతులు జోడించి బ్రహ్మవాదియైన బ్రహ్మతో నిట్లనిరి. "ఓ బ్రహ్మదేవా! మీరు వేంకటాచల మాహాత్మ్యమును వర్ణించునప్పుడు ఇంద్రద్యుమ్న మహారాజు ప్రస్తావన వచ్చినది. ఆ మహారాజునకు ఏ తపస్సు వలన ఏ దైవము నారాధించుట వలన బ్రాహ్మణ్యము సిద్ధించినదో మాకు విస్తరించి చెప్పుము." బ్రహ్మ వారికి ఇట్లు బదులు చెప్పెను.

"పూర్వము ఇంద్రద్యుమ్నుడను రాజు భూమండలము నంతయు పాలించుచు మధురాపురి యందు నివసించుచుండెను. అతడు పుట్టుకతోడనే విష్ణుభక్తి కలిగి శంఖ చక్రాన్వితుడై యుండెను. అతడు మహర్షులను పూజించు చుండెను.

ఒకనాడు ఆ రాజు వేటకై అరణ్యమునకు వెళ్ళెను. శ్రేష్ఠమైన గుఱ్ఱము నెక్కి సాయుధుడై బయలుదేరెను. అతని వెంట అమాత్యులు, వేటకుక్కల గొనివచ్చు భటులు, అడవిమార్గముల నెరిగినవారు, మంత్రజ్ఞులు వెడలిరి. రాజు పరిజనుల నందరిని వదలి మృగముల ననుసరించెను. అడవి మధ్యమున ఒక మగ జింకను చూచెను. ఆ జింక ధనుస్సులో బాణము నెక్కుపెట్టిన రాజును చూచి భ్రాంతి చెందినదై భయముతో వేగముగా పరుగిడెను. ఆడుజింకలు భయముతో రాజును చూచి ఇట్లు వేడుకొనెను "రాజా! ఆ మగజింకయే మాకు దిక్కు. దానిపై బాణము వదలకుము." ఆ మాటలు విని రాజు జింకల సంసారమును చూచి దయగలవాడై బాణమును వదలుట మానెను. తన క్షాత్ర ధర్మమును ఏవగించుకొనెను. "నా వల్లను నా పరిజనుల వల్లను మీకు హాని కలుగ"దని జింకలతో తెలిపి, వేటను చాలించి, మంత్రులు మంత్రజ్ఞులతో వెనుకకు మరలెను. పురప్రవేశము చేయగనే పట్టణ ప్రజలు హారతులిచ్చిరి. ఆ రాజు క్షాత్ర ధర్మమును వదలి దయాగుణము నవలంబించి కొంతకాలము రాజ్యమేలిన తరువాత రాజ్య భారమును కుమారులపై నుంచెను. భార్యా సమేతుడై హరిద్వారమునకు వెళ్ళెను. తపస్సు చేయుచు శ్రీకృష్ణుని సేవయందు కొంతకాల మచట గడపి జగన్నాథమునకు వచ్చెను. పద్మనేత్రుడు, దేవకీనందనుడు, భగవంతుడు అగు శ్రీకృష్ణపరమాత్మ ఉన్న ఆ ప్రదేశమునందు జడలు ధరించి వ్రతనియమము

గలవాడై మోక్షము నాశించి తీవ్రమైన తపస్సు నాచరించెను. దర్భశయ్యపై పరుండి, ఇతర చేష్టలు మాని, ఇతరమును చూచుటమాని, ఇతరమునందిష్టము లేనివాడై విష్ణువును భజించుట యందు తదేకధ్యానము కలవాడయ్యెను. కాని శివుని స్మరించుట యందు అసహ్యము కలవాడై హరిని స్మరించెను. దర్భశయ్యపై 'హరి' యను రెండక్షరము లుచ్చరించుచు ప్రమాదమున 'హర'యను రెండక్షరము లుచ్చరించెను. వెంటనే శివదూత లరుదెంచి ఆ రాజర్షిని విమానమున కూర్చుండ జేసి శివపదమైన కైలాసమునకు గొనిపోయిరి.

ఎల్లప్పుడు శివద్వేషమువలన ఆ రాజునకు శివస్మృతి కలిగినదని కైలాసమున నున్న దేవతలు భావించిరి. ఇంద్రద్యుమ్నుడు శివదూతలను, శివపదమైన కైలాసమును చూచి ఇట్లు ఆలోచించెను. "జ్ఞాన మార్గము నవలంబించిన నేను మోక్షప్రదమైన వైకుంఠమును జేరక సంపత్ప్రదమైన కైలాసమునకేల తీసికొని రాబడితి"నని చింతించెను. ఈ విధముగా ఆలోచించుచుండగా, వృషభధ్వజుడు, పరంజ్యోతియు నైన శంకరుడు పార్వతీ సమేతుడై ప్రత్యక్షమై ఇట్లు తెలిపెను. "ఓ రాజా! నీవు చింతింపకుము. నీవు నా భక్తుడవు. నా వల్లనే నీకు సంపదలు కలిగినవి. నా వల్లనే నీకు వైష్ణవము సిద్ధించినది. నీ కోరిక ఏమి? అడిగిన నే నిచ్చెదను". కలత చెందిన మనస్సుగల రాజు బదులు పలుకక యుండుట జూచి శంకరుడిట్లు వచించెను. "ఓ రాజర్షీ! నేను లేక నారాయణు డెవరు? నేనే నారాయణుడను. నన్నెవరు పొందుదురో వారికి నారాయణుడే గతి. నేను పరంజ్యోతిని. జగన్నాథుడను, బ్రహ్మను. త్రిమూర్తి ఆత్మకుడను. నారాయణుని భక్తులే నా భక్తులు. అతని లక్షణములే నా లక్షణములు." శంకరుని మాటలను విని శాస్త్రములను చదివిన ఆ రాజునకు ఆశ్చర్యము కలిగెను. తన అభిప్రాయమును కోరికను ఇట్లు తెలిపెను. "శ్రీమన్నారాయణుడే అనంతుడు, భగవంతుడు, బ్రహ్మస్వరూపి, జగత్పతి, సర్వాంతర్యామి. అతడే ముక్తి నొసగువాడు. పెక్కుమాట లేల? నీ హృదయము నందును బ్రహ్మ హృదయమునందును ఉన్నవాడు యోగులచే హృదయము నందు ధ్యానింప బడుచున్నాడు. వేదములు నారాయణుని కీర్తించుచున్నవి. అతడు సర్వ హృదయముల యందు వర్తించువాడు. మోక్షప్రదుడైన నారాయణుని వదలి ఇతర దైవముల నెవడు భజించును? పుత్ర, మిత్ర, కళత్రయుతమైన సకలైశ్వర్యములను నేననుభవించితిని. నేను సంపదల గోరుట లేదు. మోక్షమునే గోరుచున్నాను. దాని నిచ్చు వానిని తెలుప వేడుకొనుచున్నాను." శంకరు డిట్లనెను "రాజర్షీ! నీవు మోక్షము నాశించుచున్నావు. నీకు బ్రాహ్మ్యము, బ్రహ్మతేజస్సు సిద్ధించిన ఎడల విష్ణుపదమైన మోక్షమును పొందగలవు." అని చెప్పగనే రాజు కుతూహలముతో శంకరునకు నమస్కరించి ఇట్లు వేడుకొనెను. "సర్వేశ్వరా! నాకు బ్రాహ్మ్యము ఎవరివలన కలుగును? ఏ ఉపాయము చేత వైష్ణవ పదము సులభముగా సిద్ధించును? హృదయమున లక్ష్మీదేవి కలవాడై సనకాదులచే సేవింపబడు నారాయణుడెటుల ప్రసన్నుడగునో తెలుపుము."

ఆ ప్రశ్నలకు శివుడు ఇట్లు సమాధానము తెలిపెను. "భూమిపైన శ్రీ నృసింహపురి కలదు. అమిత పుణ్యము చేసిన భావితాత్ములైన ఋషుల కది నివాసస్థానము. అందలి కొండపై శ్రీనృసింహుడు కలడు. ఆ స్వామి ప్రహ్లాద వరదాయకుడు, ఎల్లప్పుడు ఆహ్లాదము కలిగించువాడు, ప్రాతఃకాలమున వికసించిన పద్మముల వంటి కోమలమైన పాదములు కలవాడు. సుందరమైన పద్మ పద్మపత్రముల వంటి కన్నులు కలవాడు, పరమపురుషుడు, కేశవుడు, లక్ష్మిని ఆలింగనము చేసికొన్నవాడు, మోక్షపదవి నిచ్చువాడు అయిన భగవంతుడు. పౌరాణికు లాక్షేత్రమును ఘటికాచల మందురు. సప్తఋషులను పేరుగల మహాత్ములందు గలరు. ఇంద్రాదులైన లోకపాలకులు, కృష్ణద్వైపాయనాదులును, ఋషులును ప్రతిసంధ్యాకాలమున స్వామిని సేవింతురు. దేవతలు, గంధర్వులు, సిద్ధులు, వసువులు నరహరియైన నారాయణుని నిరతము కొలుతురు. ఆ కొండయందు ఋషులు నివసించియున్నారు. ఆ క్షేత్రమున ఉత్తమమైన తీర్థములు కలవు. ఆ క్షేత్రమనిన నాకు చాల ప్రీతి. బ్రాహ్మ్యము, తేజస్సు నీవు కోరితివేని ఆ క్షేత్రములో తపస్సు చేయుము."

భక్త వాత్సల్యముగల శంకరుడు చెప్పిన మాటలకు రాజు చాల సంతోషించెను. దండ ప్రణామము లాచరించి ఆ దేవదేవుని తృప్తి పరచెను. శంకరుని ఆజ్ఞ మేరకు భూమికి భార్యాసమేతుడై దిగి వచ్చెను. పరమేశ్వర ప్రసాదమువలన శంఖచక్రగదా ధరుడును, పవిత్రమూర్తియు, వైరివీరులను సంహరించువాడును, మునీంద్రులచే సేవింపబడు వాడును, తనకు కైవల్యము నిచ్చువాడును అయిన ఘటికాచల నాథుడైన నరహరిని ఎప్పుడు సేవింతునా? అని భావించుచు రాజు ముందుకు సాగెను.

## రెండవ అధ్యాయము

శివుని ఆజ్ఞచే ఇంద్రద్యుమ్న మహారాజు భూలోకమునకు దిగివచ్చి పర్వత శ్రేష్ఠమైన హిమాలయమును చేరెను. ఆపర్వతముపై వాలఖిల్యాది ఋషులను, నిరాహారులను, వాయుభక్షకులను దర్శించెను. వారిని రాజు ఇట్లు ప్రశ్నించెను. "మీరు ఏ దేవుని ఉపాసించి కామితము నెరవేరిన వారివలె విశ్రాంతులై యున్నారు? ఇట్టి గతిని నేనును పొందగోరితిని. చెప్పుడు." ఋషు లిట్లు తెలిపిరి. "శ్రీ నృసింహపురి యను నొక గ్రామము కలదు. అందు లోక పితామహుడైన శ్రీ నృసింహ దేవుడు కలడు. ఆ దేవుడు రాక్షసరాజైన హిరణ్యకశిపుని సంహరించెను. శ్రీమన్నారాయణావతారమైన ఆ దేవుడు ప్రహ్లాదునిచే స్తుతింపబడెను. ఆ గిరిశృంగమున నున్న నరసింహదేవుని దేవతలు సేవింతురు. మేము కూడ అక్కడ ఉన్న హనుమత్తీర్థమున స్నానము చేసి సాయంకాలమున శ్రీనృహరికి నమస్కరించి ఈ స్థితిని పొందగలిగితిమి." రాజు ఆ మాటలు విని వారిని మరల ఇట్లు ప్రశ్నించెను. "పర్వతముపై నున్న పరమేశ్వరుని స్తుతించి పాదము వర్ణించి పరమప్రియమును మీరు పొందగలిగితిరి. ఆ నరహరి పరంతము

ఎంతదూరమున ఎచట కలదు?" వాలఖిల్యాది ఋషులు నరసింహ పురమునకు మార్గము నిట్లు సూచించిరి. "హిమాలయమునకు తొమ్మిదివేల యోజనముల దూరమున వేగవతి (పయోష్ణి) అను పేరు గల ఒకనది కలదు. దాని కుత్తరపు గట్టున పరిష్కారవతి యను పురము కలదు. ఆ నగరమునకు నైరుతి దిశయందు నృసింహదేవుని శ్రేష్ఠమైన పర్వతము కలదు. మోక్షకాములచే సేవింపబడువాడు, లక్ష్మీసమేతుడైన శ్రీనృసింహదేవు డక్కడ ఉన్నాడు. కన్నులున్నందుకు ఫలము ఆ పర్వతమును ఆ దేవుని దర్శించ వలయును. గంగానదిని దాటి, శ్రీశైల శేషశైలముల దాటి, నీవు ఘటికాచలమను ఆ పర్వతమును చేరుము."

ఆ రాజు భార్యాసమేతుడై పయనము సాగించెను. మార్గమధ్యమున గంగానదిలో స్నానము చేసి పవిత్రుడయ్యెను. శ్రీశైలమును జేరి జ్వాలా నృసింహమూర్తిని స్తుతించి నమస్కరించెను. తరువాత శ్రీనారాయణ పాదముల గుర్తులు గలిగి శేషునివలె నున్న శేష శైలమును చేరి కపిల తీర్థమున స్నాన మాచరించెను. కొండనెక్కి స్వామి పుష్కరిణిలో స్నానము చేసి, బ్రహ్మశివుడు ఇంద్రునిచేత స్తుతింపబడు పరమపురుషుని దర్శించెను. తరువాత ఉత్తరముగా ప్రవహించు సువర్ణముఖీనదిని చేరి స్నానము చేసెను. ఆ నది కీశాన్యదిక్కున ఒక వటవృక్షమును చూచెను. ఆ వృక్షము శిలావివరమున పుట్టి పెరిగెను. ఆ వృక్షముపైన చాలకాలమునుండి నివసించుచున్న ఇద్దరు రాక్షసులను చూచెను. వారి పేర్లు సువ్రత అనువ్రతులు. పూర్వజన్మమున చేసిన పాపము వలన వారు వృద్ధి చెందిరి. గొప్ప పౌరుషము కలవారు. ఆ రాజు వారిని చూచిన తక్షణమే వారిలో నొకడు అత్యుగ్రమైన రాక్షస రూపమును వదలి వైష్ణవ రూపమును పొంది ఆకాశమున ఎగిరిపోయెను.

అదిచూచి ఆశ్చర్యపడుచున్న రాజునకు ఆకాశమునుండి ఒక వాక్కు వినిపించెను. "శ్రీ నృసింహస్వామి వైభవము ఏమని వర్ణింప వచ్చును? ఆ స్వామి పుష్కరిణిలోని నీటి బిందువు తగులుట చేత ఆ ఇద్దరు రాక్షసులలో ఒకనికి రాక్షస రూపము పోయినది. ఇక నృసింహస్వామి గుణ వర్ణనమునకు ఫలము ఏమని చెప్పవచ్చును?" ఈ మాటలు విని రాజు ఇంకను ఆశ్చర్యము చెందెను. కొంత దూరమున దేవకన్యలను చూచెను. రాజువారి నిట్లు ప్రశ్నించెను "ఓ కన్యలారా! రాక్షసు లిద్దరిలో ఒకడు విముక్తుడయ్యెను. రెండవవానికి విముక్తి కలుగలేదు. స్వామి పుష్కరిణిలో గల నీటి బిందువునకు గల మాహాత్మ్యమేమి? నీటి బిందువు దేని వలన పడెను? తెలుపుడు."

ఆ కన్య లిట్లు పలికిరి. "సోమవ్రతుడను బ్రాహ్మణుడు అనసూయ అను భార్యతో తీర్థాచల సమీపమున నివసించుచుండెను. అతడు పుత్రార్థియై విష్ణుభక్తితో దారుణమైన తపస్సును స్వామి పుష్కరిణి వద్ద చేసెను. కొంతకాలమునకు ఇద్దరు కొడుకులు పుట్టిరి. పుట్టగనే వారు రాక్షస రూపము నందిరి." వెంటనే రాజు ఇట్లు ప్రశ్నించెను.

"బ్రాహ్మణ జన్మను పొందిన వారికి రాక్షస రూపము ఎందులకు కలిగెను? ఏ పాపము వలన కలిగెనో వివరింపుము". దేవకన్య లిట్లు బదులు తెలిపిరి. "పూర్వము సోమవ్రతుని తండ్రి సుతపుడను బ్రాహ్మణుడు దండకారణ్యమున నివసించుచుండెను. అతడు విరాగియై భిక్షువువలె జీవితము గడపెను. అతనికి శుశ్రూష చేయుచు భార్య భిక్షను పెట్టుచుండెను. అంగమర్దనాది సపర్యలు చేయుచు అతని వెంట సంచరించుచుండెను. సన్యసించినను ఆమెయందు కామమోహితుడై ప్రాతస్సంధ్యయందు భార్యాసక్తి కలవాడై పతితుడయ్యెను. భిక్షుకర్మకు బహిష్కృతుడయ్యెను. కొన్ని దినముల తరువాత సన్యాస రూపమును వదలి వైష్ణవ పదమును పొందెను. అతని భార్య ఉజ్జ్వలుడైన సుతుని కనెను. అతడే సోమవ్రతుడు. అతడు భార్యతో కూడి తపస్వియై ఆహార నియమమును పూని అడవిని చేరెను. ధేనుశ్శైలమునకు తూర్పు భాగమున భార్యతో కూడి తపోనిష్ఠుడయ్యెను. ఒకప్పుడు ఆ శిలపై రాక్షస మిథునమును చూచెను. ఆ పర్వతమునందు కొంతకాలము సుఖముగా గడపెను. తన భార్య అతనితో సంభోగము కోరినప్పుడు ఆమెతో కూడినవాడై ప్రతి పర్యాయము రాక్షస భావమును తలచుచుండెను. రాక్షస రూపమును తలచుట చేత సంతానము రాక్షసత్వము నొందెను. పితామహుడైన సుతపుడు ప్రాతఃకాలమునందు తమోగుణ ప్రధానుడై పతితుడైనందున పాపులైన సుతులు కలిగిరి. పుట్టిన తోడనే తండ్రిని వదలి ఆ రాక్షసులు శిలయందు పుట్టిన వటవృక్షము నాశ్రయించిరి. జన్మాంతరపుణ్యముచేత హనుమత్తీర్థమున స్నానమాచరించిన ఊర్వశి వెంట్రుకలనుండి రాలిన నీటి బిందువు చేత ఒక రాక్షసుడు రాక్షసత్వమును బాసెను."

మరల రాజు ఇట్లు ప్రశ్నించెను. "ఏ పుణ్యము చేత ఒక రాక్షసునకు వైష్ణవ రూపము సిద్ధించెను? దేనివలన రెండవవానికి పాపము వచ్చెను?"

దేవకన్యలిట్లు బదులు పలికిరి, "ఓ రాజా! పారియాత్ర గిరియందు మృగముల వేటాడు ఇద్దరు కిరాతులు నివసించుచుండిరి. మృగముల వేటాడుచు అరణ్యమున తిరుగుచున్నప్పుడు తపోధనుడైన సౌమ్యుడను సన్యాసిని చూచిరి. అతడు వేరు వేరు అరణ్యములకు వెళ్ళునప్పుడు పర్ణశాలలు నిర్మించి శుశ్రూష సలిపిరి. ఆ సన్యాసి కిరాతులయందు దయగలవాడయ్యెను. వారతనిని ఇట్లు ప్రశ్నించిరి. "స్వామీ! మీరు సర్వజ్ఞులు. ఏ విధితో ఏ మంత్రోపదేశముతో మాకు బ్రాహ్మణత్వము సిద్ధించునో తెలుపుడు." ఆ సన్యాసి వారు దుర్మదులైన కిరాత వంశజులని తెలిసికొని వారికి ఒక మంత్రమును కల్పించి ఉపదేశించెను. "మృగ ఏవాహమ్" అను మంత్రమును ప్రతి దినమును అన్యచింతన లేక జపింపు"డని తెలిపి ఆ సన్యాసి తక్షణమే వెడలిపోయెను. విధిపూర్వకముగా కిరాతులా మంత్రమును రహస్య స్థలమున జపించిరి. కొంత కాలమునకు వారికి మృగరూపము కలిగెను. ఆ కిరాతులు తమకు మంత్రముపదేశించిన

యోగిని వెదకుచు అరణ్యమున సంచరించుచుండగా ఆ సన్యాసి అగుపించెను. దయాళుడైన అతడు వారు తన శిష్యులని గ్రహించి వారిని పిలిచి మంత్రించెను. పవిత్ర ఉదకములతో వారి దేహములను తాకెను. ద్వాదశాక్షర మంత్రము వారి కుపదేశించి ఇట్లు తెలిపెను. "ద్వాదశాక్షరీ మంత్ర యోగమున సువ్రతానువ్రతులను మీరు బ్రాహ్మణ్యము పొందగలరు." ఆ మాటలకు సంతసించి కిరాతులిట్లు ప్రశ్నించిరి. "ఏ ప్రదేశము చేరి ఈ మంత్రమును జపించినచో మాకు బ్రాహ్మణ్యము సిద్ధించును?" సన్యాసి ఇట్లు తెలిపెను" శ్రీ నృసింహస్వామికి నివాసమైన శైలము ఇక్కడ కనుపించు చున్నది. ప్రక్కన లోయలో హనుమంతుని తీర్థమున్నది. అక్కడకు శీఘ్రముగా వెళ్ళుడు. ఆ స్థలము నాకు చాల ప్రియమైనది. ఇంద్రుడు, అగ్నిదేవుడు, ఇతర దేవతలు అయనము లందును, సంక్రాంతి యందును, సూర్యచంద్ర గ్రహణములయందును ఆ తీర్థములో స్నానము చేసి శ్రీనృసింహ స్వామిని ఉపాసింతురు. ఇంద్రియములను నియమించి సూర్యోదయమునకు పూర్వము స్నానమాచరించు పురుషునకు పాపములు నశించి కోర్కెలు నెరవేరును. మీరిద్దరు నిరాహారులై, అందరి యందు ప్రేమ కలిగి, ఇతరమునందాశలేక, ఉత్తమమైన తపస్సును చేయుడు. కొంతకాలమునకు మీకు బ్రాహ్మణ్యము లభించును. విష్ణుపదమును పొందగలరు".

మృగరూపులైన సువ్రతానువ్రతులు ఆ సన్యాసికి నమస్కరించి ఘటికా చలమునకు ప్రదక్షిణము గావించిరి. ఆ కొండ ప్రక్కలో నున్న హనుమత్తీర్థమున స్నాన మాచరించి క్షణములో మృగరూపమును వదలిరి. గురువు చెప్పిన రీతిగా ఆ కిరాతులు నృసింహ మంత్ర రాజమును హనుమంతుని వద్ద 100 పర్యాయములు జపించి ఆంజనేయునకు నమస్కరించిరి. ఉత్తర శృంగము నెక్కి భైరవ సమీపమున తమకు పర్ణశాలలను నిర్మింప దలచిరి. శిలా పుష్కరిణి తీరమున వెదుళ్ళ గుంపును చూచి, ఆపుష్కరిణి వారుణ దిశలో నూరు వెదుళ్ళను ఛేదించిరి. వెదుళ్ళను పెంచిన విప్రశేఖరుడను తపస్వి అయిన ద్రావిడ బాలకుడు కోపించి కమండలు ఉదకమును గొని వారి నిట్లు శపించెను. "చాల కాలమునుండి నాచే పెంచబడిన వెదుళ్ళను మీరిద్దరు ఛేదించితిరి. కాన సోమవ్రతునకు జన్మించి రాక్షస దేహమును పొందుదురు. గాక"

విప్ర శేఖరుని శాపము వినగానే సువ్రతుడు అతని పాదముల పట్టుకొని "స్వామీ! దయానిధీ! నాకు శాప విమోచనము అనుగ్రహింపు"మని వేడుకొనెను. అప్పుడు విప్రశేఖరుడు ఇట్లు శాప విమోచన కాలమును తెలిపెను. "పూర్వపుణ్యము వలన మృగములను చంపు మీరు తీర్థరాజమైన హనుమత్తీర్థమున స్నానము చేసితిరి. బుద్ధిహీనులైన మీరు ఆ సరస్సున స్నానమాచరించుట వలన శుద్ధమైన మనస్సు గలవారై ఇట్టి స్థితిని పొందితిరి. మీ ఇద్దరిలో నీవు మహాజ్ఞానశాలివి. ఇతరులకు ప్రియము కలిగించు వాడవు.

ఇక ముందు రానున్న కృతయుగమున నీకు శాపవిమోచనము కలుగును. ఫాల్గున మాస అంతమునందు ఆ సరస్సునకు అప్సరసలు స్నానమాడవత్తురు. ఊర్వశి కూడ వచ్చును. అచ్చట స్నానము చేసి వెడలుచున్న ఊర్వశి వెంట్రుకల నుండి మార్గమధ్యమున నీటిబొట్టు నీతలపై పడును. అది నీకు విమోచన కాలము. హేయమైన ఈ దేహమును వదలి వైష్ణవ రూపమును పొంది తరువాత విష్ణు పదమును పొంద గలవు”

అంతట రాజు దేవకన్యలతో తన సంశయము నిట్లు తెలిపెను. “తన సహచరుడైన అనువ్రతుని శాపవిమోచనము సువ్రతు డెందులకు ప్రశ్నింప లేదు?” దేవకన్య లిట్లు తెలిపిరి “అను వ్రతుని ముక్తి కొరకు సువ్రతుడు ఉపాయము నడుగుట కుద్యుక్తుడు కాగానే విప్రశేఖరు డా సరస్సు తీరము నుండి అంతర్ధానము నొందెను. ఇట్లు సోమవ్రతుని పుత్రుల కథ నీకు తెలిపితిమి. ఓ రాజా! నీకు మేలగు గాక.”

ఆ వచనములు విని రాజు సంతోషమును పొంది ముహూర్తకాలము ధ్యానమగ్నుడయ్యెను. ఈ ఉత్తమ కథను ఎవరు పఠింతురో, పురాణ సూక్తము లే పురుషుడు వినునో, ఘటికాచల నాథుని విభూతి వలన కల్మషములను బాసి చిరాయువై వృద్ధి గాంచును.

## మూడవ అధ్యాయము

భార్యతో కూడి ఇంద్రద్యుమ్నుడు మహానదీ తటమును దాటి దేవకన్యలను మరల ఇట్లు ప్రశ్నించెను. “సోమవ్రతుడను విప్రుడు పితృ ఋణము నుండి ఎట్లు విముక్తు డయ్యెను? అతనికి వేరు పుత్ర సంతతి కలదా?” దేవకన్య లిట్లు తెలిపిరి. “పూర్వ జన్మమున వైశ్యుడుగా పుట్టిన సమాధి యనువాడు మాహిష్మతీ నగరమున నివసించు చుండెను. ఆ వైశ్యునకు సురస, విరస అను ఇద్దరు భార్యలుండిరి. చిన్న భార్యయగు విరసయందు అనిష్టము కలిగి తీర్థములయందు స్నానము చేయునప్పుడు పెద్ద భార్యకే సంతతి కలుగ వలెనని ప్రార్థించు చుండెను. చిన్న భార్య అతని ననుసరించి యుండి నిందింప బడియును భర్త సేవ ఎల్లప్పుడు చేయుచుండెను.

ఒకప్పుడు ఘటికాచలమును చేరి హనుమత్తీర్థమునందలి నీటి బిందువుచే పాపము పోగొట్టుకొన్నవాడై కొండనెక్కి నరసింహదేవుని హృదయమున నమస్కరించెను. ఆ వైశ్యునకు బ్రాహ్మణ్యము లభించి తేజస్వియై సోమవ్రతుడను నామము కలవాడయ్యెను. మరల నమస్కరించి కన్నులు తెరచి వరము నిట్లు కోరెను. “సత్వ బలుడైన సుతుడొకడు చిన్న భార్య యగు విరసకు కలుగవలెను”. నేనెందు కిట్టి వరమును కోరితినని చింతించి రాత్రి అందు గడపి తెల్లవారగనే లేచి తీర్థమున

స్నానముచేసి హనుమంతుని వద్ద నిలిచి "నా జ్యేష్ఠ భార్యకు ఇద్దరు సుతులు కలుగవలె"నని కోరెను. దైవయోగమున అట్లే జరిగెను. చిన్నభార్యకు దేవవ్రతుడను పుత్రుడు కలిగెను. అతని మనుమడే ధ్రువుడు. సోమవ్రతు డిట్లు లోక విఖ్యాతుడైన సాత్వికుడైన పుత్రుని పొందెను. నరసింహ దేవుని వలన అతనికి బ్రాహ్మణ్యము సిద్ధించెను."

రాజు ఆ దేవకన్యలను పొగడి భార్యాసమేతుడై ఘటికాచలము నుద్దేశించి దక్షిణ దిశగా ప్రయాణము సాగించెను. మార్గ మధ్యమున అత డింద్రుని చూచెను. రాజేంద్రుడగు ఇంద్రద్యుమ్నుడు దేవేంద్రుడు కుశల ప్రశ్నలు ముగిసిన తరువాత పరస్పర మనోరంజకములైన మాటలాడిరి. ఇంద్రుడు ఇంద్రద్యుమ్నునితో "రాజా! క్రూరకర్ములై జనపదముల యందు విజృంభించు రాక్షసులు జనులను పీడించుచున్నారు. కాలకేయులకు రాజైన నరమాంస భక్షకుడైన కుంభోదరుడను రాక్షసుడు ఒక అరణ్యమున కలడు. ఈశ్వరునిచే వరములను పొంది ఋషులను భక్షించి జగత్తును పీడించుచున్నాడు. నృసింహ పురికి రాజైన సురథుని యుద్ధమున ఓడించెను. సురథుడు మంత్రి, భార్య వెంటరాగా అరణ్యమును ప్రవేశించెను. బలగర్వితులగు రాక్షసులు నృసింహ పురమున నివసించుచు జనులను బాధించిరి. ఆ జనులు ఘటికాచలము పైకి ఎక్కిరి. దైవ వశాత్తు నేను అక్కడకు వెళ్ళి నృసింహదేవుని ప్రార్థించి పరుగిడుచున్న జనులను చూచితిని. ఆ దేవదేవుని స్తుతించి ప్రజలను రక్షింపుమని వేడితిని. భగవంతుడగు నరహరికి వారి కష్టములను విన్నవించితిని. "స్వామీ! కాలకేయ రాక్షసులు మదోన్మత్తులై సురథుని అడవులకు తరిమివైచి గొప్ప శూలములతో ద్విజులను ఋషులను బాధించుచున్నారు. సురథుడెప్పుడు తిరిగి రాజ్యమును పొందగలడు? అందరిని పాలించగలడు?" అని అడిగితిని.

శ్రీ నరసింహ స్వామి కరుణించి ఇట్లు తెలిపెను. "శాలివాహన కాలమున యోగనిద్రా ప్రసాదము వలన సురథుడు నా పురమును ప్రవేశించి ప్రజలను రక్షించును. వచ్చెడు త్రేతాయుగములో నా అంశతో పుట్టిన ఇంద్రద్యుమ్ను డనురాజు భూమిని పాలించును. ఆంజనేయుని సహాయముచేత కాలకేయులను జయించును. అతడు బ్రాహ్మణ్యము నర్థించును. నేనతనికి బ్రాహ్మణ్యము నొసగగా చక్రాంకితుడై వైష్ణవ రూపము నందగలడు." ఇట్లు తెలిపి భగవానుడు అంతర్ధానము నందెను. నేను నా పురమునకు వెళ్ళితిని. ఇప్పుడు నారదు డగుపించి "ఇంద్రద్యుమ్నుడు ఘటికాచలము చేరుటకై వచ్చుచున్నా" డని తెలుపగా నేను నిన్ను చూడవచ్చితిని. వరమును పొందిన కాలకేయులు పురమును పాలించుచున్నారు. శ్రీహరి తన చక్రమును హనుమంతుని కొసగిన హనుమంతుడు నీకు సహాయముగా యుద్ధమున నిలుచును. రాక్షసులను సులభముగా జయించగలవు."

ఇంద్రుని మాటలను విని రాజు ఇట్లనెను. "విష్ణు భక్తులను హింసించు కాలకేయులను నా బాణములచే చంపి కాకులకు గద్దలకు ఆహారమగునట్లు చేయుదు"నని కోపముతో పలికెను. ఇంద్రు డతనికి తన వజ్రాయుధమునుండి దాని అంశము గల వేరొక వజ్రాయుధము కల్పించి యిచ్చెను. తన రథము నుండి ఇంకొక రథమును కల్పించి ఇచ్చెను. శస్త్రముల నిచ్చెను. ఇతరలోకపాలురు తమ అంశలను అస్త్రములను ఇచ్చిరి. సముద్రుడు రత్నము నిచ్చెను. వాయుదేవుడు వేగము నిచ్చెను. యమధర్మరాజు ధ్వజము నిచ్చెను. సూర్యుడు తన సారథినుండి సారథిని కల్పించి ఇచ్చెను. గుఱ్ఱములనుండి గుఱ్ఱముల నిచ్చెను. బాణములను అక్షయతూణీరములను దేవేంద్రుడిచ్చి దేవతలతో కూడి ఆకాశమునుండి యుద్ధమును తిలకించుచుండెను. రాజు రెండింతల బలము కలవాడై రథము నెక్కి, భార్యతో కూడ ముందునకు పోయి. నరసింహపురిని చేరెను. శత్రు భయంకరమైన అల్లెత్రాటి ధ్వనుల చేసెను. ఇట్లు రాజు విజృంభించెను.

## నాల్గవ అధ్యాయము

రాక్షస సార్వభౌముడైన కుంభోదరుడు ఇంద్రద్యుమ్నుని వింటి నారి ధ్వని విని ఖరముఖ దుర్ముఖులను రాక్షసులను పంపెను. వారు కామరూపులై అదృశ్యులై వెడలి రాజును అతని సేనను తిలకించిరి. వెనుకకు మరలివచ్చి కుంభోదరునితో ఇట్లనిరి. "స్వామీ! ఒకానొక రాజు అపర విష్ణువువలె వెలుగొందుచు కొండపై ఉన్నాడు. నూర్లకొలది గుఱ్ఱములు, వేలకొలది ఏనుగులు, రథములు కలవు. దశనాగ బలులు, సింహపరాక్రమములు అగు అతని అనుచరులు ఆభరణములు ధరించి ఆయుధములు గల వారై యున్నారు. యువకులు, ఖడ్గపాణులైన సైనికులు వెయ్యిమంది ఉన్నారు. చర్మ కవచములు తొడిగి యుద్ధము చేయుటకు సిద్ధముగా ఉన్నారు. వారు చూపు మాత్రముతోనే శత్రువులను కాల్చివేయ గలరు. ఆ రాజు యుద్ధరంగమున నీరాకకై వేచియున్నాడు". శత్రువులను పొగడు సేవకుల మాటలు విని బలగర్వితుడైన రాక్షస రాజునకు కోపము వచ్చి వారలను దండించి ఇట్లనెను. "మూడు లోకములందును నాతో యుద్ధము చేయు వాడెవ్వడు కలడు? మనుష్య మాత్రునకు నన్ను జయించు శక్తి కలదని నీవు ఎట్లు అనుచున్నావు? దేవతలతో కూడ నాకు చావు లేదని ఈశ్వరునిచే వరము పొందితిని. దుర్బలుడగు నరుడు ఎట్లు నన్ను జయించును?" కోపించిన రాజును చూచి దుర్ముఖుడు వెడలిపోయెను. దుష్టాత్ముడైన ఖరవక్త్రుడను రాక్షసుడు రాక్షస రాజుతో అనుకూలముగా ఇట్లు ప్రియ వచనములు పలికెను. "రాక్షస రాజా! నీవు ఇంద్రద్యుమ్నుని జయించిన యెడల ఐరావతమను గజరత్నమును, అశ్వరత్నమును, కల్పవృక్షాదులను నృపతి యొక్క భార్యను నీవు పొందగలవు.

భార్యను కోల్పోయిన రాజు ప్రాణములు విడచును." ఈ అనునయ వాక్యములను విని రాక్షసరాజు ప్రీతుడై "నీవు లెస్సగా పలికితివి. ఆ రాజును పరిజనులను యుద్ధమున చంపి అతని భార్యను హరింతు"నని తెల్పెను. ఇట్లు పలికి తన మంత్రికుమారులను ఇట్లు ఆజ్ఞాపించెను. "మీరు యుద్ధమున ఇంద్రద్యుమ్నుని జయించి అతని భార్యను ఎత్తుకొనిరండు" ఆ మాటలు విని అమాత్యసుతు లిట్లనిరి. "స్వామీ! మీరిక్కడనే కూర్చొని యుండి విజయమును పొందుడు. మేము వెళ్ళి ఆకాంతను అపహరించుకొని వత్తుము."

ఇట్లు అమాత్య సుతులు రాక్షసరాజు శాసనమును మన్నించి, గాడిదలచే కట్టబడిన రథమును ఎక్కిరి. వారి రథములపైన డేగలు నూర్లకొలది కూర్చొనెను. కొన్ని చుట్టుగా తిరిగెను. రథములపై మేఘములు ధూళి రూపమైన వానను కురిసెను. మంత్రి కుమారుల ముందు గొప్ప గాలితో పిడుగులు పడెను. ఈ ఉత్పాతములను వారు లెక్కచేయలేదు. తమ బలములో మూడవ భాగము సేన వెంట రాగా పురము వెడలిరి.

యుద్ధ భూమికి వచ్చిన రాక్షస మంత్రి సుతులను చూచి రాజు నినాదము చేసెను. అమాత్య సుతులు క్రోధముతో అట్టహాసము చేసిరి. వారు రాజు రథమును చుట్టివైచిరి. రాజు విల్లును వంచి వింటివారితో ధ్వని చేసెను. ఆ నారి శబ్దమును సహించలేని వారై మంత్రిసుతులు రథములను వదలి దిక్కులకు పరుగిడిరి. చెవిటివారి వలె చేతులలో నున్న వస్త్రములను వదలి కంపించిరి. క్షణములో తెలివిపొందిన వారై అస్త్రములను రథములను స్వీకరించిరి. రాజులలాటమున నొక బాణము, తలయందు రెండు, కంఠమున మూడు, వక్షమున మూడు, భుజముల యందు నాలుగు బాణములు వదలి ఆ మంత్రిసుతు లట్టహాసము చేసిరి. మంత్రి సుతులచే విడువబడిన బాణములు రాజును గాయపరచెను. అతడు ఎఱ్ఱని చిగురు టాకులు మొలచిన చెట్టువలె నుండెను. రాజు వానిని లెక్కపెట్టక మంత్రిసుతులపై ఒక శస్త్రమును వదలెను. ఆ వాడిగల శరముచేత జెండాలు, గుఱ్ఱములు, సారథులు ఆకాశమున కెగిరెను. మంత్రిసుతులా శరమును వారింపలేక పోయి మరణించిరి. రాబందులు నక్కలు సంచరించు యుద్ధ భూమి ఏర్పడెను. దేవఋషులు చారణులు "బాగు బాగ"ని పుష్పవర్షము కురిపించిరి. నక్షత్రమాలల చేత అలంకరింపబడిన మేరు పర్వతము వలె ఆకాశము నుండి పడిన పుష్పముల చేత రాజు ప్రకాశించెను.

పారిపోయిన రాక్షసులు రాక్షస రాజును చేరి "ఏడ్గురు మంత్రి పుత్రులు గతించి" రని తెలిపిరి. బాధాకరమైన ఆ వచనములను విని రాక్షస రాజు చింతించెను. ఒక క్షణము పామువలె నిట్టూర్చి ఇట్లనెను "ఓ మహామాత్యుడా! యుద్ధభూమికి వెళ్ళి రాజును చంపి వాని భార్యను గొని తెమ్ము" ప్రధానామాత్యుడు "స్వామీ! మీ రిక్కడనే

ఉండుడు. నే నొక్కడనే వెళ్ళి శత్రు బలమును నివారించెదను." ఇట్లు పలికి అతడు యుద్ధభూమిని చేరెను.

## అయిదవ అధ్యాయము

కాలకేయులను యుద్ధమునందు జయించుటకు ఇంద్రద్యుమ్నుడు, ఇంద్రుడు శ్రీ నరసింహస్వామిని ఇట్లు స్తుతించిరి.

ప్రసీద జగతాం నాథ భగవ న్నృహరే హరే,
పరిపాలయ సర్వాన్నః పరిపంథికులం జహి.
ధర్మార్థకామ మోక్షాణాం ప్రదాతా భగవాన్ భవాన్,
త్వం యజ్ఞ స్త్వం వషట్కారః త్వం బ్రహ్మ త్వం ప్రజాపతిః.
త్వం వేద్యో వేదవి ద్భి స్త్వమోకార స్త్వ మసీశ్వర,
సృష్టి స్థితి లయాదీని కృత్యాని భవతః ప్రభో.
స్థితి భాంజీతి విద్వాంసో బ్రువంతి బ్రహ్మవాదినః,
త్వం తేజ స్వీ త్వమోజస్వీ త్వం వర్చస్వీ త్వమీశితా.
షణ్ణామపి రిపూణాం త్వ మూర్మీణామపి బోధకః,
కల్పాదౌ యోగనృహరే పాల్యంతే భవతా ప్రజాః.
తదం తే రుద్ర రూపేణ సంహ్రియంతే ప్రజా స్తథా,
సృజ్యంతే బ్రహ్మరూపేణ పునశ్చ జగదీశ్వర.
యచ్చ త్రిష్వపి వేదేషు ఏక ఏవహి గీయతే,
స త్వం ప్రసన్నో దేవేశ పాహి భక్తా నతంద్రితః.
స త్వం తత్త్వమసి వ్యక్తో వ్యక్తా తీత స్త్వ మే వహి,
యజ్ఞ గోప్తా యజ్ఞ వేత్తా యజ్ఞ కర్తా త్రయీ మయః.
త్వమేవ విశ్వం బహుధా జాతం యజ్ఞాయ చేతయత్,
జాయమానంచ సర్వం యత్త్వం తత్కర్తా సి కేశవ.
సహస్ర శీర్షా పురుషః సహస్రాక్షః సహస్ర పాత్,
స భూమిం విశ్వతో వృత్వా అత్య తిష్ఠ ద్దశాంగులమ్.
పురుష ఏవేదగ్ం సర్వం యద్భూతం యచ్చ భవ్యం,
ఉతామృతత్వ స్యేశానో యదన్యే నా తిరోహతి.

వ్యక్తా వ్యక్త గిర స్సర్వా వేదాద్యా వ్యాహరంతి యమ్,
సతాం సర్వప్రద స్సత్త్వం ప్రత్యగ్దృష్టి భి రీడ్యసే.
పృథివ్యాదీని భూతాని స్థావరాణి చరాణిచ,
త్వదేక వశగానీతి వ్యాహరంతి మనీషిణః.
ఋతం సత్యం పరం బ్రహ్మ పురుషం కృష్ణపింగళమ్,
ఊర్ధ్వ రేతం విరూపాక్షం విశ్వరూపాయవై నమః.
త్వా మాహురంతి బహుధా భగవంత మనామయమ్,
దైత్య రాజం వినిర్భిద్య హిరణ్య కశిపుం పురా,
ప్రహ్లాదం హ్లాదయన్ దేవ యోగభావం సమాస్థితః,
సర్వేషాం కర్మణాం దేవ భువి వ్యాకుర్వతాం జనైః,
పర్వతాగ్ర మథిష్ఠాయ పశ్యసి త్వ మనాకులః.

ఇంద్రుని స్తుతిని విని భగవంతుడు "దేవేంద్రా! శత్రువుల నేమి చేయవలయు"నని ప్రశ్నించెను. దేవేంద్రుడు "ఇంద్రద్యుమ్నునికి సహాయము చేయవలయును. రాజు నిమిత్త మాత్రుడు" అని వేడుకొనెను. నృహరి కొంత తడవాలోచించి హనుమంతుని చూచి ఇట్లనెను. "నీవు రుద్రాంశమును ధరించి యుంటివి. యుద్ధమున దేవతలు నిన్ను ప్రార్థించుచున్నారు. నీకు వరమిచ్చెదను. నీకు భద్రమగు గాక. వరము వేడుకొనుము." హనుమంతుడిట్లు వరమును కోరెను. "స్వామీ! మీ పాదములు నా తలపై ఎల్లప్పుడు ఉండుగాక. శంఖచక్రములను కూడ శాశ్వతముగా కోరుచున్నాను." నరహరి తన భుజ ద్వయమునుండి భుజద్వయమును, శంఖమునుండి శంఖమును, చక్రము నుండి చక్రమును కల్పించి యిచ్చెను. హనుమంతుని ఇట్లాదేశించెను. "ఇంద్రద్యుమ్న డను రాజు బ్రాహ్మ్యమును కోరి బహుకాలము తపస్సు చేసి నా వద్దకు వచ్చెను. క్రూరులైన రాక్షసులు నా పురమును పాడుచేసిరి. ధర్మాత్ము డైన రాజువారితో యుద్ధము చేయ బయలుదేరెను. నీ సహాయమున ఆరాజు జయమును పొందగలడు. రాక్షస బలగములను నివారించుము." హనుమంతుడు నరసింహునికి నమస్కరించి పర్వత శిఖరమును చేరెను. స్వామి అంతర్ధాన మయ్యెను. ఇంద్రాదులు యుద్ధము చూడగోరి ఆకాశమున నిలిచిరి.

ఇంతలో ఆంజనేయుడు చక్రము నెత్తి గర్జించెను. శంఖమును పూరించెను. వేలాది కాలకేయులు ముసలాది ఆయుధములను చేపట్టి అడ్డు తగిలిరి. హనుమంతుడు మరల శంఖమును పూరించి వారి రథములపై దుమికెను, శంఖ ధ్వనిచే కొందరు, దర్శన మాత్రమున కొందరు రాక్షసులు భూమిపై కూలిరి.

కొండవలెను, రెండవ సూర్యుని వలెను ఉన్న హనుమంతుని చూచి దేవతలు "జయీభవ" అని దీవించిరి. పూల వాన కురిపించిరి. దుందుభులు మ్రోగించిరి. పుష్పించిన వృక్షమువలె హనుమంతుడు ప్రకాశించెను.

# ఆరవ అధ్యాయము

హనుమంతుడు రాక్షసులను చంపగా ఇంద్రద్యుమ్నుడు సంతసించి, హనుమంతుని బలపరాక్రములను, ధైర్యమును, వీర్యమును పొగడెను. దక్షుని సంహారమునకై పూనుకొనిన రుద్రునివలె ఉన్నాడని కొనియాడెను. ఋషులు దేవతలు ఆకాశమునుండి యుద్ధమును చూచుచుండిరి. ఇంద్రుడు భేరీ శబ్దమును చేసెను. రాక్షసులు దుందుభులను మ్రోగించిరి. "ఇంద్రద్యుమ్నుడు గెలుచుగాక" అని ఇంద్రుడు "కుంభోదరుడే గెలుచుగాక" అని రాక్షసులు పలికిరి. ఆకాశమున సంకుల సమరము జరిగెను. ఇంద్రుడు వజ్రాయుధమును ధరించి హనుమత్సన్నిధికి చేరుకొనెను. అప్పుడు హనుమంతుడు హుంకారముతో రాక్షసులను చంపెను. ఇంద్రుడు హనుమంతుని పొగడెను. ఇంద్రద్యుమ్నుడు తన తపఃఫలమైన మణిమాలతో హనుమంతుని అలంకరించెను. నక్షత్రములచే చుట్టుకొనబడిన చంద్రునివలె హనుమంతుడు ప్రకాశించెను.

యుద్ధమున మహామాత్యుడు హనుమంతుని వద్దకు రథమును తీసికొని పోయెను. వివిధ ఆయుధములతో రాక్షసులు ఎదిరించి పోరిరి. హనుమంతుడు వారిని నివారించెను. మహామాత్యుడు తనరథమును హనుమంతుని ముందుంచెను. హనుమంతుడు వాని ధ్వజమును పతాకమును కూల్చెను. అమాత్యుడు రథము నుండి దిగి గదాది ఆయుధములతో యుద్ధము చేసెను. హనుమంతుడు శిలను గ్రహించి వానిపై విసరెను. తోకతో కొట్టి అట్టహాసము చేసెను. కాలకేయులు పైబడుచున్న ఆ శిలను ప్రక్కకు తొలగించిరి. అది చూచి మారుతి సాలవృక్షమును పెకలించి వారిపై వేసెను. వారించుటకు వీలుగాని సాలవృక్షమును చూచి రాక్షసులు యుద్ధము చేయుటకు భయపడి పరుగెత్తిరి. హనుమంతుడు వారివెంట పడి చేతులతో చావగొట్టెను.

మహామాత్యుడు కోపముతో రాజువైపుకు పరుగెత్తెను. ఇంద్రద్యుమ్ను డతనిని చూచి ధనుష్టంకారము చేసెను. రాక్షసులు భయము చెందిరి. మహామాత్యుడు కూడ ఆ ధ్వనికి భయపడెను. రాజు మహామాత్యుని మాటలచే నొప్పించెను. "అస్త్ర శస్త్ర ప్రయోగ సామర్థ్యము గల నీవు నాధనుష్టంకారముతో ప్రాణములను వదలకుంటివే?" ఆ మాటలు విని అమాత్యుడు క్రోధముతో ఇట్లు పలికెను "రాజా! వట్టి మాటలు కట్టి పెట్టుము. ఈ ప్రగల్భము లెందుకు? నీవు సమర్థుడవైతే ద్వంద్వయుద్ధమునకు రమ్ము. ఇష్టము లేనిచో యుద్ధము నుండి తొలగి సుఖముగా నుండుము" అని చెప్పి

మహామాత్యుడు రోషముతో ధనుష్టంకారము చేసి రెండు బాణము లెక్కుపెట్టెను. రాజు కూడ రెండు బాణముల నెక్కుపెట్టెను. మంత్రి రెండు బాణముల ప్రయోగించెను. వానిని రాజు తునుకలు చేసెను. మహామాత్యుడు 5 బాణములను వదలెను. ఇంద్రద్యుమ్ను డాబాణములను తునుకలు చేసెను. రాక్షసుడు 20 బాణముల ప్రయోగించెను. రాజు హస్తలాఘవముతో వానిని తొలగించెను. రాజు తరువాత అనేక బాణముల ప్రయోగించెను. రాక్షసుని కిరీటము క్రిందపడెను. వాడు రథము నుండి క్రిందపడెను. రాజు వాని రథమును ముక్కలు చేసెను. ఇంకొక రథము నెక్కి మహామాత్యుడు రాజును, హనుమంతుని పది బాణములచే కొట్టెను. హనుమంతు డాబాణములను లెక్కచేయక సారథిని అరచేతితో మోదెను. గుఱ్ఱములను, ఏనుగులను సైన్యమును చంపి అదృశ్యుడయ్యెను. ఒక శరముతో రాజు మహామాత్యుని మకుటమును పడవేసెను. నాలుగు బాణములతో వాని రథమును, ఒక బాణముతో వాని ఇనుప కవచమును, మూడు బాణములతో అక్షయ తూణీరములను, మూడు బాణములతో గుఱ్ఱమును, ఒక బాణముతో ధ్వజమును, 10 బాణములతో అమాత్యుని కొట్టెను.

ఆయుధములను సైన్యమును కోల్పోయిన అమాత్యుడు గదతో వచ్చెను. హనుమంతుడు వాని తలపై చావు దెబ్బ కొట్టెను. అష్టఘంటలు గల గదను వదలి రాక్షసుడు పడిపోయెను. ఇంద్రద్యుమ్నుడా గదను బాణములతో బూడిద చేసెను. గద వ్యర్థము కాగా సాలవృక్షమును పెకలించి అమాత్యుడు ఇంద్రద్యుమ్నుని రథముపైకి విసరెను. హనుమంతు డా వృక్షమును పట్టుకొని మంత్రిపై వైచెను. మంత్రి శిలను ప్రయోగింపగా దానిని భూమిపై పడవేసెను. అమాత్యుడు దంతములను పటపట కొరుకుచు పర్వత శిఖరము నెక్కెను. ఈకలు గల బాణములను వదలి రాజు అమాత్యుని హస్తమును తెగవేసెను. మహామాత్యుడు కోపముతో వేరొక భుజముచేత సాలవృక్షమును పెకలించి రాజుపై వేసెను. హనుమంతు డావృక్షమును పట్టుకొని అమాత్యుని పై వైచెను. వృక్షముచేత కొట్టబడి మహాబలుడైన మహామాత్యుడు నోరు తెరచుకొని మృతి చెందెను. దేవతలు ఋషులు పుష్పవర్షము కురిపించి "బాగు బా" గని ప్రశంసించిరి.

## ఏడవ అధ్యాయము

రాక్షస రాజైన కుంభోదరుడు మణిపీఠమున కూర్చొని ఇట్లు చెప్పెను. "సైనికులారా! మహామాత్యుడు గతించెనని మీరు అధైర్యపడవద్దు. మీ కోరిక లను నేను తీర్చెదను." అని పలికి రణకోవిదులైన తనకుమారులను ధూమ్రాక్ష, భీమాక్షులను చూచి "మీరు వానరమును, రాజును, చంపి అతని భార్యను తీసికొని రండ"ని ఆదేశించెను. ఆ మాటలు విని రాక్షస రాజ సుతులు చంద్ర సూర్యులవలె రథముల నెక్కి నగరము

బయటకు వచ్చి పద్మవ్యూహమును పన్నిరి. సుడిగాలి ఏర్పడి సారథులు నేలకూలిరి. కొందరు రాక్షసులు మరణించిరి. అనేక అమంగళకరములైన ఉత్పాతములు కలిగినను లెక్కసేయక రాక్షసరాజ సుతులు ముందునకు సాగిరి.

ఇంద్రద్యుమ్నుడు హనుమంతునితో ఇట్లనెను. "దూరమునుండి రాక్షస రథములు యుద్ధ భూమికి వచ్చుచున్నవి. యుద్ధము జరుగును. నీ దక్షిణ హస్తమున నరసింహస్వామి యిచ్చిన సుదర్శనము కలదు. మనకు జయము కలుగును." ఇంతలో దేవతలు "హనుమంతుడు జయించుగాక" అని దుందుభులు మ్రోగించిరి. దుందుభి స్వనములను విని ధూమ్రాక్షుడు రణభూమికి తన రథమును తెచ్చెను. హనుమంతుడు రాజును హెచ్చరించి రాక్షసులను సమీపించెను. రాళ్ళను వృక్షములను వారిపై పెకలించి వైచి శంఖమును పూరించెను. రాక్షసులు చనిపోవుట చూచి ధూమ్రాక్షుడు హనుమంతుని ప్రశంసించెను. "నీవు గొప్ప రణవీరుడవు. వీరులను రాక్షసులను చంపి శంఖమును పూరించితివి." అనెను. ధూమ్రాక్షుని ముందున్న ఏనుగును హనుమంతుడు కొట్టగా అది రాక్షసులకు భయమగునట్లు ఘీంకారము చేసెను. అందులకు కోపించి రాక్షసుడు ఆకాశమున కెగిరి హనుమంతునిపై 8 బాణము లను ప్రయోగించి ఇట్లనెను. "ఓ వానరేంద్రా! నేను ప్రయోగించిన 8 బాణములను త్రిప్పికొట్ట గలిగితివేని నేను యుద్ధభూమిని వదలి పాతాళమునకు పోయెదను." హనుమంతుడా బాణములను ఖడ్గముతో తొలగించెను. తనబాణములు వ్యర్థముకాగా ధూమ్రాక్షుడు హనుమంతునితో ఇట్లనెను. "భూలోకములో నీయంతటివాడు లేడు. ఇక పుట్టబోడు. నా 8 బాణముల నాపిన నీకు నమస్కారము. సుఖీభవ. నేను పాతాళమునకు వెళ్ళుచున్నాను."

ధూమ్రాక్షుడు వెళ్ళగా భీమాక్షుడు 'నిన్ను మ్రింగెద' నని హనుమంతుని ముందుకు వచ్చెను. భీమాక్షుడు బాణము నెక్కుపెట్టక ముందే మారుతి వానిని కణతపై కొట్టెను. వాడు రథమునుండి క్రిందపడెను. రక్తము కారుచుండెను. ఇది చూచి కాలకేయులు భయముతో హాహాకారము చేయుచు దశ దిశలకు పరుగెత్తిరి. భీమాక్షుడు పైకి లేచి పాతాళ భేది అను గజము నెక్కెను. ఏనుగు పై వచ్చు భీమాక్షుని చూచి హనుమంతుడు భుజాస్ఫోటనము చేసి ఆకాశము నుండి వానిపై దూకెను. మాయావి యగు భీమాక్షుడు హనుమంతుడు పడబోవు చుండగా చూచి ప్రక్కకు జారుకొనెను. హనుమంతుడు పడగానే గజము చూర్ణమయ్యెను. అంగరక్షకులు కూడ చచ్చిరి. భీమాక్షుడు మాయచేత ఆకాశమునుండి బాణవర్షము కురిపించెను. భీమాక్షుడు కనుపించక పోయినను చూపరులకు వాని బాణములు మాత్రము అగుపించెను. అప్పుడు హనుమంతుడు మసక మసకగా కనుపించు ఆ రాక్షసుని చంపెను. రాక్షసులనేకులను కూడ చంపి ఇంద్రద్యుమ్నుని చేరెను. రాజు సంతోషముతో మారుతిని ఆలింగనము చేసికొనెను. పుష్పవర్షము కురిసెను. దేవతలు దుందుభులను మ్రోగించిరి.

రాక్షసులు, పుత్రులు పడిపోవుటచేత కుంభోదరుడు కోపించి స్వయముగా రథారూఢుడై పురము వెలుపలికి వచ్చెను. వాడు శివుని పూజించి వరములను పొంది నాయకత్వము వహించి యుద్ధమునకు వచ్చెను. రాక్షస బలగ మంతయు వాని ననుసరించెను. అశుభమును సూచించుటకు ఉల్క రథముపై పడెను.

రాక్షస రాజు మారుతి తలపై బాణముల ప్రయోగింపచూచెను. రాక్షస రాజు బాణముల ప్రయోగింపక ముందే ఇంద్రద్యుమ్నుడు వాని ధనుస్సును విరచెను. రథమును గాడిదలను కూల్చెను. వేరొక ధనుస్సును తీసికొని వాడు హనుమంతుని ముందుకు వచ్చెను. ఇంద్రద్యుమ్నునిపై ఆగ్నేయాస్త్రమును ప్రయోగించెను. రాజు దానిని వారుణాస్త్రముచే నివారించెను. దేవతలు సంతసించిరి. రాక్షసరాజు ప్రయోగించిన బాణములను హనుమంతుడు ఖడ్గము చేతను చక్రముచేతను నివారించెను. రాక్షస రాజు తపోబలముచే పొందిన శూలమును తీసి "బాణమును ధరించిన భూపతిని, శంఖచక్రముల ధరించిన మారుతిని శూలముచే సంహరింతు"నని పలికి ప్రయోగించెను.

ఇంద్రద్యుమ్నుడు, హనుమంతుడు ఆకాశమున వచ్చుచున్న శూలమును చూచి చింతించిరి. "నీవు నారాయణాస్త్రమును ప్రయోగింపక కాలయాపన మెందుకు చేయుదు"వను మాటలు రాజు వినెను. నారాయణాస్త్రమును ప్రయోగించెను. నారాయణాస్త్రము, హనుమంతుని ఖడ్గము రాక్షసుని శూలమును నివారించెను. చేయునది లేక రాక్షసరాజు అనుచరులతో పాతాళమున కేగెను. మహర్షులు దేవతలు తమకష్టములు తొలగెనని పుష్పవృష్టిని కురిపించిరి.

## ఎనిమిదవ అధ్యాయము

ఇంద్రద్యుమ్నుడు, హనుమంతుడు రణరంగమును వదలి సంతసముతో ఆసీనులైరి. దేవతలు రాజును వరమును కోరుమని తెలిపిరి. రాజు "మీరు ప్రసన్నులైనచో నేను చాలకాలమునుండి కోరుచున్న బ్రాహ్మ్యమును ప్రసాదింపు" డని వేడుకొనెను. దేవతలిట్లనిరి "బ్రాహ్మ్యమును పొందుట అందరికి సాధ్యము కాదు. నరసింహుని అనుగ్రహముతో కొంతకాలము ప్రజలను పాలింపుము. తరువాత బ్రాహ్మ్యమును పొందగలవు." ఇట్లని ఇంద్రాదులు రాజును తీర్థజలముచే అభిషేకించిరి. హనుమంతుని చూచి "నీ పేరుతో ఈ పట్టణము ప్రసిద్ధి గాంచునని" ఇంద్రుడు వరమొసగెను. ఋషులు దేవతలు స్వస్థానములకు వెళ్ళిరి. హనుమంతుడు నృసింహుని చేరెను. హనుమత్పురమును పాలించుచు రాజు సుఖముగా నుండెను.

ఒక దినము రాజు ప్రాతఃకాలమున శ్రీనరసింహస్వామిని పూజించుటకు ఘటికాచలము నెక్కెను. శిలాపుష్కరిణిలో భార్యతో కూడి స్నానము చేసెను. శ్రీహరిని

ఇంతలో వశిష్ఠ మహర్షి తన ఆశ్రమ మిక్కడ కలదని తెలిపెను. ఆ ఆశ్రమముతో సింహములు, వ్యాఘ్రములు, జింకలు మొదలగు జంతువులు వైర భావము వదలి నివసించు చుండెను. అచ్చట ద్విజులు దీక్షతో నరసింహ స్వామిని సేవింతురు. సుమతియను వశిష్ఠుని శిష్యుడు ఆశ్రమమును రక్షించును. నృహరిని ధ్యానముచేసి పృథులోముడను ద్విజుడు సాలోక్యముక్తిని గాంచెను. ఇక్కడ ఉన్న అయిదు రేగుచెట్లు విశ్వామిత్రునిచే శపింపబడినవై ఫలరహితముగా ఉన్నవి.

రాజు వశిష్ఠుని ఇట్లు ప్రశ్నించెను. "విశ్వామిత్రుడు బ్రాహ్మ్యము నెట్లు పొందెను. 5 రేగుచెట్లు విశ్వామిత్రునిచే ఎందుకు శపింపబడెను?"

మొదటి ప్రశ్నకు వశిష్ఠ డిట్లు బదులు తెలిపెను. " పూర్వము ఇంద్రుడు మీరు ఏ దేవుని గూర్చి చెప్పుచున్నారు?" అని వేదములను ప్రశ్నించెను. వేదములు మేము భగవంతుడు, వేద వేద్యుడు, సంసార తారకుడు, సృష్టికర్త, అయిదు తలలు కలవాడు, నాలుగు చేతులు కలవాడైన బ్రహ్మదేవుని గూర్చి చెప్పుచున్నాము" అని తెలిపెను. అప్పుడింద్రుడు "వేదములారా! మూఢమతులై మీరట్లనుచుంటిరి. ఈశానుడు, జగదీశ్వరుడు, సృష్టిస్థితిలయ కారకుడు, నారాయణునకు ప్రియుడు అయిన పరమేశ్వరుడే 5 తలలు కలవాడు. (సద్యోజాతాది పంచ వక్త్రుడు) ఇతరులు పంచ వక్త్రులు కా"రని పలికి ఇంద్రుడు కోపించి వేదములపై వజ్రాయుధమును ప్రయోగించెను. వేదములు బ్రహ్మను శరణు పొందెను. బ్రహ్మ తన కమండలూదకముచే ఇంద్రుని వారించి వజ్రాయుధమును తిరిగి ఇంద్రునిపై ప్రయోగించెను. ఇంద్రుడు భయపడి శివుని శరణు వేడెను. శివుడు హుంకారముచే వజ్రమునాపి, బ్రహ్మపై కోపించి ఊర్ధ్వమున ఉన్న బ్రహ్మయొక్క అయిదవ తలను నఖముతో తీసివైచి "నీవు చతుర్ముఖుడవై యుండు" మనెను. అప్పటి నుండి బ్రహ్మకు చతుర్ముఖనామము సిద్ధించెను. బ్రహ్మ ఈశ్వరుని స్తుతించెను. శ్రీ నరసింహస్వామి బ్రహ్మ అంగవైకల్య దోషము నివారించెను. బ్రహ్మ తన పేరిట ఒక సరస్సును నిర్మించెను. (బ్రహ్మతీర్థము) అందులో గురువారము మధ్యాహ్నము స్నానము చేసిన వారికి అగ్నిష్టోమాది యజ్ఞములు చేసిన ఫలము లభించును. దేవపితృ తర్పణము చేసిన వారికి సంతతి వర్ధిల్లును. చెట్లు నాటి పెంచిన వారికి సుఖము కల్గును. మాఘమాసమున **"ఓం నమో భగవన్ విష్ణో వాసుదేవ జగన్మయ హరే నరహరే పాహి ఘటికాచల నాయక"** అను మంత్రమును పఠించి స్నానమొనర్చిన పాపక్షయమగును.

## తొమ్మిదవ అధ్యాయము

ఏకశిల అనబడు కొండకు దక్షిణమున బ్రహ్మ సరస్సు కలదు. అక్కడ శింశుపా వృక్షమూలమున భైరవుడున్నాడు. నృహరి శాసనము చేత అతడు తీర్థములను

రక్షించును. దుష్టగ్రహములను నివారించుచుండును. బ్రహ్మసరస్సు ఎడమవైపున భైరవతీర్థము కలదు. అందు బ్రాహ్మీ ముహూర్తమున స్నానము చేసినవారు పాపములనుండి విముక్తులై స్వర్గమును పొందుదురు. గంధర్వులు, కిన్నరులు భైరవతీర్థమున వేదమంత్రముల పఠించుచు స్నానము చేయుదురు. వైఖానసులు వాలఖిల్యులు కూడ స్నానము చేయుదురు. దిలీపరాజు స్నానముచేసి జీవన్ముక్తుడయ్యెను. చంద్రుడు తీర్థదర్శనము చేతనే గురుతల్పగత దోషము నివారించుకొనెను. ఇక స్నానము చేయువారికి ఏమి లభించదు? ప్రహ్లాదుడు ప్రాతఃకాలమున స్నానముచేసి జితేంద్రియుడై నృహరిని పూజించెను.

ఒకప్పుడు భైరవునిచే పాలింపబడు పర్వతము ద్వితీయ మేరుపర్వతము వలె పెరుగ జొచ్చెను. అది చూచియు ఇంద్రుడు భైరవ రక్షిత శైలముపై తన ఆయుధమును ఉపయోగింపలేక పోయెను. బలభద్రుని చేరి "శైలము పెరుగుచున్నది. భైరవాజ్ఞను తీసికొని దానికి ప్రతిక్రియ చేయు"మని ప్రార్థించెను. బలభద్రుడు హలముతో పర్వత శిఖరమును లాగెను. శైలము మీద హలముతో హలావర్తమను గుంతను చేసెను. హలావర్తమున తపస్సు చేయువారికి పుణ్యాలోకములు కల్గును. సోమవారము హలావర్తమున స్నానము చేసిన వారికి అనంతఫలము కలుగును. పూర్వము అహల్య ఇంద్రుని ఆలింగనము చేసినందున కలిగిన పాపము తీర్థ స్నానముతో నివారించుకొనెను. గౌతముడు భార్యాశిష్య సమేతుడై భైరవతీర్థ ఉత్తర భాగమున తపస్సు చేయుచున్నాడు. హలావర్తమున కుత్తరమున గౌతమ తీర్థము కలదు. దానిలో స్నానము చేసి నృహరిని ధ్యానించిన పరమపదమును పొందుదురు.

గౌతము తీర్థమునకు ముందు భాగమున శిలాపుష్కరిణి కలదు. అందు స్నానము చేసిన కోరికలు నెరవేరును. ముందు చెప్పబడిన మంత్రము నుచ్చరించి శనివారము స్నానము చేసిన పాపములు తొలగును.

పూర్వము విశ్వరూపుడను వాడు దేవతల గురువై యున్నప్పటికి హవిర్భాగముల రాక్షసులకు పంచుచుండెను. అది తెలిసికొని ఇంద్రుడు కోపించి విశ్వరూపుని మూడు తలలను వజ్రాయుధముతో ఖండించెను. ఆ మూడు శిరస్సులు తిత్తిరి, కలవింక, కపింజల పక్షులయ్యెను.

విశ్వరూపుని చంపుట చేత ఇంద్రునకు బ్రహ్మ హత్యాపాపము కలిగెను. ఆ బ్రహ్మహత్యా పాపమును భూమికిని, వృక్షములకును, నదులకును పంచిపెట్టెను. తరువాత ఇంద్రుడు, బ్రహ్మతీర్థమునందును, భైరవ తీర్థమునందును, గౌతమతీర్థమునందును, శిలా పుష్కరిణి యందును స్నానము చేసి పాపమును పోగొట్టుకొనెను.

ఇంద్రద్యుమ్నుడు, దేవతలు పై తీర్థములయందు స్నానము చేసి పాపములు పోగొట్టుకొనిరి. ఎత్తైన కొండను ఎక్కిరి. దానికి కోటిశృంగములు కలవు. మహాశృంగమున దక్షిణమున శ్రీహరి కలడు. సనకాది ఋషులచే సేవింపబడువాడు ప్రహ్లాదునిచే స్తుతింపబడినవాడు, వామదేవునికి ముక్తినిచ్చుటకై అవతరించినవాడు, సప్తర్షిగణములచే సేవింపబడువాడు అయిన నరసింహుడు రత్నసింహాసనాసీనుడై యోగాసనముతో కూర్చొని యున్నాడు. ప్రణవాకారముతో హేమకోటి విమానముపై 32 స్తంభములు గలిగి 12 ద్వారములు కలిగి, మధ్య మహాకమలము కలిగి, కర్ణికయందు రత్నములు కలిగి, భూపురము కలది అగు యంత్రమున షట్కోణ మధ్యమున బిందుస్థానమున నున్న నరసింహుని ధ్యానించ వలయును. ఇంద్రుడు నరసింహుని ఇట్లు స్తుతించెను.

ప్రసీద లోకేశ్వర లోకనాయక ప్రహ్లాద ముఖ్యై ఋషిభిః ప్రసేవిత,
హిరణ్యదైత్యేంద్ర వధ క్షణేనవై విధాయ సౌఖ్యం కురుషే త్వమేవహి.
ప్రద్యుమ్న సంకర్షణ వాసుదేవ ముఖైరనేకై రనురూపభేదైః,
మహాద్రివాసీ నృహరే త్వమేవం సంధృశ్యసే లాస్యకరో యథైకః.
సవామదేవో భరతోపి తావుభౌ ప్రమోచితౌ సంసృతి సంగ బంధనాత్,
హరే మహాత్మన్ నృహరే స్తుతే ఘృణా తయో స్త్వవైవం ఘటికైక మాత్రతః.
వైవస్వతే సంప్రతి సప్త చర్షయో విముక్త భావం గమితా జగత్పతే,
తవానుకంపా మన వాప్యకోపా చ్ఛుకాదయో ముక్తిపదం నభేజిరే.
తవాక్షిపాతేషు సహస్రశోద్విజా మహర్షయ శ్చాపి సురర్షయస్తదా,
విముక్తి కామా భగవ న్నిరాకులా స్తపంతి తీవ్రం తప ఏవ కేవలమ్.
త్వమేవ ఖం భూరుదకం సమీరణ శ్శిఖావల శ్చాపి భవంత మంతరా,
పరం నలోకే నృహరే ప్రదృశ్యతే త్వమేవ విశ్వం విభృషే తథాకృతిమ్.
అసంశయం ప్రాణి పతి ర్విరించనో లయంవ్రజ త్యంతక ఏష ధర్మరాట్,
సర్వేచ దేవానృహరే త్వమేకః కల్పావసానే వటపత్రశాయీ.
త్వమేక ఏ వేశ్వర భావ మేయివాన్ తుషారశైలేంద్ర సుతా పరిగ్రహమ్,
తమోగుణ స్పృత వపుర్జటాధరో జగంతి నేతా నృహరే హరే సదా.
హరే భవానేవ చతుర్ముఖస్స్వయం సత్త్వాధికోద్రేకతయా ప్రజాపతిః,
వచస్పవిత్రీకరపీడనోచితో జగంతి పాతా నృహరే త్రయీమయః.
శ్వేతే మహాద్వీపవరే భుజంగమే శేతే శ్రియాయో భగవాన్ సరాజసః,
త్వమేవ విష్ణో నృహరే హరే సదా జగంతి పాతాసి పవిత్ర మూర్తిమాన్.

**తవైవ వక్త్రాన్నిగమాదికా గిరః పురాతనా శ్చేతస ఏవ చంద్రమాః,
ముఖాదహం చాక్షిత ఏవ భానుమాన్ కర్ణాద్దిశో వ్యాకురుషే త్రయీ హరే.
వేదైక వేద్యం పురుషం మహాంత మాదిత్యవర్ణం తమసః పరస్తాత్,
అవస్థితం త్వాం ఘటికాచల స్థితం శ్రియానుషక్తం శరణం ప్రపద్యే.**

ఇట్లు ఇంద్రుడు నృహరిని స్తుతింపగా సూర్యబింబము వలె శ్రీహరి విమానమున ప్రత్యక్షమయ్యెను. "ఓ ఇంద్రుడా! నీవు బ్రహ్మసరస్సులో స్నానము చేసిన తరువాత సర్వపాపములనుండి విముక్తుడవైతివి. వరము వేడుకొను"మని స్వామి తెలిపెను. ఇంద్రుడు నాచే చేయబడిన స్తోత్రము నరులు పఠించినచో నరహరి ప్రీతి నొందుగాక. నిరపాయులై, విష్ణు భక్తికలవారై, అకాలమృత్యువులేక సుఖము చెందుదురు గాక" అని వరమును కోరెను. దానికి నృహరి అంగీకరించెను. ఇంద్రుడు నమస్కరించి స్వర్గమునకు పోయెను.

## పదవ అధ్యాయము

ఇంద్రద్యుమ్నుడు వశిష్ఠునితో ఇట్లు ప్రశ్నించెను "మహర్షీ! విశ్వామిత్రుడు బ్రాహ్మణ్యము నెట్లుపొంద గలిగెనో తెలుపుడు".

వశిష్ఠుడిట్లు తెలిపెను. "పూర్వము విశ్వామిత్రుడు రాజై భూమిని పరిపాలించుచుండెను. అనేక యాగములను చేసెను. రాజ గర్వముతో సురభి అను ధేనువును చూచి అసూయ పడెను. దానిని పొందగోరి ఓడిపోయెను. క్షాత్రముకన్న బ్రాహ్మ్యమే గొప్పదని భావించి సూర్యుని గూర్చి కఠిన తపస్సు చేసెను. సూర్యుడు ప్రసన్నుడై "శైలముపై నున్న వామదేవుని ముక్తుని చేయుటకై ఉద్భవించిన నరసింహస్వామిని సేవించిన బ్రాహ్మ్యమును పొందగలవు. ఒక ఘడియకాలము తపస్సు చేసిన నరసింహుడు కోర్కెలను తీర్చును. నృహరి అనుగ్రహముచే వశిష్ఠుని మాటచే నీవు బ్రాహ్మ్యమును పొందగలవు" అనెను.

సూర్యుని చూచి విశ్వామిత్రుడు "వామదేవుని చరిత్ర వివరింపు"మని కోరెను సూర్యుడిట్లు తెలిపెను.

కృతయుగమునందు బ్రహ్మచర్యము నవలంబించి వామదేవుడు తండ్రివద్ద వేదాధ్యయనము చేసెను. గురుదక్షిణ ఏమి ఇవ్వవలెనని తండ్రిని ప్రశ్నించెను. "ఫాల్గునమాసమున పితృశ్రాద్ధము చేయుటకు అమృతమును గొని తెమ్ము" అని తండ్రి కోరెను. అమృతమును పొందు విధము తెలిసికొనుటకై వామదేవుడు తన తండ్రికి గురువైన అగస్త్యుని చేరబోయెను. అక్కడ అగస్త్య తీర్థమున స్నానము చేసి అగస్త్యుని పాదములకు నమస్కరించెను. మంగళవారమునాడు అగస్త్య తీరములో

స్నానము చేసిన పరస్త్రీ సంగమ దోషము నివారణమగును. పూర్వము రావణుడు దిగ్విజయము చేయుచు సంచరించునప్పుడు ఇచ్చట గొప్ప తపమాచరించుచున్న వేదవతిని చూచి కామించెను. వేదవతి కోపగించుకొని త్రేతాయుగమున సీతనై జన్మించిన నా కారణముగా నీ పది తలలు వడిపోవునని శపించెను. అగస్త్యుడిట్లు తెలిపెను. ఇక్కడకు పశ్చిమముగా గొప్ప పర్వతమున్నది. కృతయుగమున బంగారముగాను, త్రేతాయుగమున వెండిగాను, ద్వాపరమున రాగిగాను, కలియుగమున శిలగాను 14 శిఖరములు ఉన్నవి. అచట హేమకోటి విమానముపైన శ్రీనృహరి ఉన్నాడు. ఋషులు ఘడియలో ముక్తి పొందుటచేత ఆ కొండను ఘటికాచలమందురు. అక్కడ హనుమంతుడు నృహరిని గూర్చి తపస్సు చేసెను. ఆ కొండపైన హనుమత్తీర్థము శ్రేష్ఠమైనది. అక్కడ ఆదివారము స్నానము చేసిన వాంఛితములు నెరవేరును. శ్రీరాముడు అయోధ్యకు తిరిగి వెళ్ళునపుడు ఆ తీర్థమున స్నానము చేసెను. ఉత్తర శృంగమున పాండవులు తపస్సు చేసి పాండవ తీర్థమును నిర్మించిరి. ఇందులో స్నానము చేసిన గోసహస్రదానఫల మేర్పడును. దూర్వాసునిచే శాపమును పొందిన బుధుడు ఇక్కడ తపస్సు చేసి స్వర్గమును పొందెను.

వామదేవుడు అగస్త్యు నిట్లు ప్రశ్నించెను "దూర్వాసునిచే బుధుడు ఎందులకు శాపమును పొందెను?" అగస్త్యుడిట్లు తెలిపెను. దూర్వాసుడొకప్పుడు ఘటికాచలము చేరి స్వామి నిర్మాల్యమైన తులసి మాలను ధరించగా బుధుడు నవ్వెను. దూర్వాసుడు కోపించి తులసిమాలను ధరించిన నన్ను జూచి నవ్వినందులకు 12 సంవత్సరములు భూలోకమున ఉందువు గాక! తరువాత గ్రహాధిపత్యము కలుగును." అని శపించెను. బుధుడు 12 సంవత్సరములు తపస్సు చేసి నృహరి అనుగ్రహమును పొందెను. ఇక్కడ బుధవారము స్నానము చేసిన ఆరోగ్యము పొందగలరు.

# పదకొండవ అధ్యాయము

**గిరిప్రదక్షిణము :**

అగస్త్య మహర్షి వామదేవునితో ఇట్లనెను. ఏ మానవుడైన బ్రహ్మతీర్థము మొదలగు తీర్థములలో స్నానమాచరించుచు గిరిప్రదక్షిణము చేసిన శ్రేయస్సు కలుగును. "ఆ మాటలు విని వామదేవుడు ఇట్లు ప్రశ్నించెను. "ఏ తీర్థములందు స్నానము చేసిన విశేషమైన పుణ్యము కలుగును? గిరి ప్రదక్షిణ మెట్లు చేయవలయును". అగస్త్యుడిట్లు తెలిపెను. "ఈ పర్వతమునకు రెండు విధములుగా ప్రదక్షిణము చేయవలయును. మొదటిది మహా ప్రదక్షిణము. రెండవది ఆంతర ప్రదక్షిణము. మహాప్రదక్షిణమును గురించి వివరముగా తెలిపెదను. సావధానముగా వినుము. ఈ మహా ప్రదక్షిణము పూర్వము శౌనకాది మహామునులు చేసి శ్రీ నృసింహస్వామి అనుగ్రహమును పొందిరి.

ఇక్కడకు తూర్పున ఒక శైవ క్షేత్రము కలదు. అక్కడ శివుని సేవించి దక్షిణాభిముఖముగా ప్రయాణించిన ఇంద్రక్షేత్రమను ఆశ్రమము చేరుదువు. అక్కడ రెండు పర్వత శృంగములు కలవు. అక్కడ ఉన్న వహ్ని కుండములో శుక్రుడు తపస్సు చేయును. దానికి దక్షిణపు దిక్కున అగస్త్యాశ్రమము కలదు. దానికి పశ్చిమమున నంది గ్రామము కలదు. అక్కడ దూర్వాసుడు తపస్సు చేయును. అక్కడ సోమగుండమను తీర్థము కలదు. దానికి సమీపములో మహాకాంచి అను పేరుగల ఆశ్రమమున్నది. అందు నా తమ్ముడైన శృత తీవ్రతపుడు కలడు. అక్కడ పద్మసరస్సు కలదు. ఆ ప్రాంతమునకు వెళ్ళుటకు నాకు కోరిక కలుగుచుండును. అక్కడ నాకు రామలక్ష్మణులు దర్శనమిచ్చిరి. వారిని నేను పూజించితిని. రావణుని చంపుమని ప్రేరేపించితిని. దివ్యాస్త్రముల నొసగితిని. రాముడు తమ్మునితో ఈ పవిత్ర తీర్థమున స్నానము చేసినందున రావణుని జయించ గలిగెను.

ఈ ప్రాంతములో పూర్వము హేమాంగదుడు, చిత్ర రథుడు, హేమకేతుడు, మహారథుడు, శ్వేతకేతువు అను అయిదుగురు గంధర్వులు నాచే విడిపించబడిరి. వారు దత్తాత్రేయుని అనుగ్రహముతో వరములను పొంది మదించి అజేయులై తిరుగుచుండిరి. ఆ దుర్మార్గులు సర్వాయుధములు ధరించి ఒక పర్యాయము బ్రహ్మ లోకమునకు పోవుచు మార్గమధ్యమున యమలోకము చేరిరి. అక్కడ వందలకొలది యమకింకరులు మానవులను రౌరవాది నరకములలో హింసించుట చూచిరి. ఆ మానవుల హాహాకారములు విని గంధర్వులు కోపముతో "యమ కింకరులారా! మీరు ఎందులకు వీరలను బాధించుచున్నారు. ఎవరి ఆదేశము మేరకు ఇట్లు చేయుచున్నారు?" అని ప్రశ్నించిరి. యమకింకరులు వారి మాటలు లెక్కసేయక మానవులను బాధించుచుండిరి. వర గర్వితులైన గంధర్వులు కోపించి యమ కింకరులను వివిధ ఆయుధములతో బాధించిరి. కింకరులు వారితో యుద్ధము చేసి జయింప లేక వారిచే పరాజితులై యముని శరణు జొచ్చిరి. యమధర్మరాజు మృత్యువును ముందుంచుకొని, కాలదండమును ధరించి, తన సైన్యముతో వచ్చి గంధర్వుల మద మడచెను. గంధర్వులిట్లు యమునిచే పీడింప బడుచుండగా దత్తాత్రేయుడు తన భక్తుల బాధలను చూచి తపస్సు చేయుచున్న నా కడకు వచ్చి ఇట్లనెను. "ఓ మహర్షీ! నాచే వరములను పొందిన గంధర్వులను యముడు తన కాలదండముతో బాధించుచున్నాడు. కాలదండము అజేయమైనది. నా వరము నిష్ఫలము కారాదు. కనుక శ్రీనృసింహో పాసకుడవైన నీవు వారి యుద్ధమును మాన్పింప వలయును." అని ఆదేశించెను. నేను దత్తాత్రేయుని ఆజ్ఞ మేరకు యముని బారినుండి గంధర్వులను విడిపించితిని. బ్రహ్మర్షిగణ సేవితమైన ఈ పద్మోదమను సరస్సులో స్నానము చేసి, తపస్సుచేసి, తమ గర్వాహంకారములను వదలి తమపురమున కేగిరి. ఈ సరస్సు మాహాత్మ్యము వింటివి కదా? ఏ మానవుడైన ఈ సరస్సులో స్నానముచేసి, పితృదేవతలకు తర్పణము చేసి,

తులసి బిల్వము మొదలైన వృక్షములను పెంచిన నాయొక్క, నా తమ్ముని యొక్క ప్రభావముతో నృసింహదేవునియందు భక్తి కలవారై సాత్వికులై పుట్టుదురు.

ఈ తీర్థమునకు పడమటి దిక్కున ఆకాశము నంటు వృక్షములు కలవు. ఆ వృక్షములు భగవంతుడైన వాల్మీకిచే పెంచబడినవి. అచ్చట వాల్మీకి ఆశ్రమము కలదు. ఈ ఆశ్రమములో వాల్మీకి 87000 సంవత్సరములు వ్రత నియమముతో తపస్సు చేసెను. అతని శరీరముపై పుట్ట పెరిగెను. అందులో పాములు చేరెను. అప్పుడు నారదుడు వేడగా సర్వలోక పితామహుడైన బ్రహ్మ సరస్వతీ సమేతుడై ఆవిర్భవించెను. బ్రహ్మ సరస్వతితో ఇట్లనెను. ఈ మహాత్ముడు నృసింహునియందు తీవ్రమైన భక్తితో తపస్సు చేయుచున్నాడు. పుట్ట తనపై పెరుగుచున్నను తెలియక ఉన్నాడు. నేను, ఈశ్వరుడు కూడ ఇట్టి తపము చేయలేము కదా?" అని పలికి "వాల్మీకీ! పైకి లెమ్ము. ఇటుపై నీవు వాల్మీకి నామముతో పిలువబడుదువు" అని దీవించెను. బ్రహ్మ వచనానుసారము వాల్మీకి పుట్టనుండి బయటికి వచ్చెను. బ్రహ్మ కమండలు జలముతో ప్రోక్షింపగా శక్తిని పొంది, కన్నులు తెరచెను. బ్రహ్మను చూచి ఇట్లు స్తుతించెను.

**ధాత శ్చేమాని భూతాని జాయంతే హి జగత్పతే,**
**యేన జాతాని జీవంతి యత్ప్రయంతి నమోస్తుతే.**
**యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ,**
**నమస్తే పూష్ణి సంస్థాయ బ్రహ్మణే పరమేష్ఠి నే.**
**యస్యాజ్ఞయా తిష్ఠతీదం జగత్స్థావర జంగమమ్,**
**నమో వేదాంత వేద్యాయ బ్రహ్మణే తే మహాత్మనే.**
**భగవన్ త్వన్ముఖే భాతి యథా గీర్దేవతా సతీ,**
**ఇయంహి సర్వభూతానాం కురుతే స్వర భేదనమ్.**
**పాశాంకుశ ధరా వాణీ వీణా పుస్తక ధారిణీ,**
**ఏషా వసతి సర్వేషు ముగ్ధకుందేందు నిర్మలా.**
**ఇయం ప్రసన్నా నృణాం వై ప్రవర్తయతి సంపదః,**
**దీర్ఘ మాయుశ్చ నిరతం కవితాంచ సుధామయీమ్.**
**సైషా సుధా స్వధా స్వాహా స్తుతిశ్చ ధృతి రేవచ,**
**గాయత్ర్యాదీని ఛందాంసి బ్రహ్మన్నస్యాం భవంతి వై.**
**హ్రీర్ధీర్భీశ్చ తథాపుష్టి ర్నిద్రాహింసాతథామతిః,**

**ఇయం దేవీ భగవతీ దుర్గా లక్ష్మీ సరస్వతీ.**
**ఛాయా సువర్చలా సేయం ఏకాపి బహురూపిణీ.**

ఇట్లు స్తుతించి నమస్కరించెను. బ్రహ్మ అతనిని పైకి లేపి "వల్మీకము నుండి వచ్చితివి గనుక వాల్మీకి వగుదువు (వల్మీకము అనగా పుట్ట) ముందు నీ నోటివెంట "మా నిషాద........" అను శ్లోకము వెలువడినది కదా? ఈ శ్లోకము నీ నోటినుండి ఎందుకు వచ్చినదని నీవు ఆలోచించుచుండగా నారదుడు వచ్చి నీకు ఉపదేశము చేసెను. నారదుడు కోరినట్లు నీవు నృసింహుని స్థానమైన ఈ కొండపై తపస్సు చేయుచున్నావు. నీకు రామాయణ కథను నారదుడు తెలుప గలడు. నీకు ప్రజ్ఞను కీర్తిని ఇవ్వవలెనని వచ్చితిని. ఇది మొదలు నీ కీర్తి శాశ్వతమై ప్రకాశించగలదు. నీ నోటివెంట సరస్వతి ఆవిర్భవింప గలదు. సర్వజనులు ఆదరించు రామాయణ మహాకావ్యమును రచింప గలవు. అనితర సాధ్యమైన గొప్ప కీర్తిని పొంది, ఆదికవివై ముల్లోకములలో కీర్తింపబడ గలవు." ఇట్లు పలికి బ్రహ్మ సారస్వత మహామంత్రము నుపదేశించి అంతర్ధాన మయ్యెను. ఆ మంత్రమును జపించి వాణి అనుగ్రహముతో వాల్మీకి రామాయణమును రచించెను.

వాల్మీకి ఆశ్రమములో రామతీర్థము కలదు. ఇచ్చట వివిధ వృక్షములు కలవు. దీనికి ఉత్తరమున శిలాకూటము కలదు. ఇది శ్రీయోగ నరసింహస్వామి పాదతీర్థము. ఇచ్చట అత్రిమహర్షి తపస్సు చేసి బ్రహ్మవిష్ణు మహేశ్వరులను పుత్రులుగా బడసెను.

## పదిరెండవ అధ్యాయము

వామదేవుడు అగస్త్యుని ఇట్లు ప్రశ్నించెను. "ఓ బ్రహ్మర్షీ! బ్రహ్మాది దేవతలు ఏ మహాత్ముని పుత్రులై యుండిరో అట్టి అత్రిమహర్షి ప్రభావమును నాకు వివరింపుము." అని ప్రశ్నింపగా అగస్త్యుడిట్లు తెలిపెను. "పూర్వము సింహళద్వీపములో సింధు ద్వీపుడను మహర్షిచే ప్రేరేపింపబడి, ఔర్వుడను మహర్షి పుత్రార్థమై తపస్సు చేసెను. ఆ మహర్షి తీర్థములలో స్నానము చేయుచు నిరాహారుడై, క్రోధమును జయించినవాడై, ఋషులచే మెప్పుబడసి విష్ణుభక్తి కలిగి తపస్సు చేసెను. నియమముల పాటించి ఔర్వుడు మూడు పూటల స్నానముచేసి, వాసుదేవుని సేవించి, మూడు పూటల వైష్ణవులైన ఋషులకు నమస్కరించు చుండెను. శ్రుతకీర్తి అను అతని భార్య అరుంధతి వలె ఉత్తమ గుణములు కలిగి అతనిని సేవించుచుండెను. భర్తను విడచి ఉండలేక అతనితో కలసి మెలసి యుండి భర్త భుజించిన తరువాత భుజించుచు ఎల్లవేళల భర్తకు పరిచర్యచేయుచుండెను. ఆమె సత్యవాదిని, సాధ్వి, విష్ణుభక్తి పరాయణ. ఆమెకూడ పుత్రుల బడయుటకై వైష్ణవోత్తములను ఆరాధించుచుండెను. కొంతకాలము తరువాత

మహర్షు లందరు ఆ దంపతుల కఠిన వ్రతమును, వారి పుత్రాభిలాషను గమనించి భగవంతుని ఇట్లు ప్రార్థించిరి. "ఓ ప్రభూ! మేము విష్ణుభక్తులైన వైష్ణవులమైనచో, వేదమార్గము ననుసరించు వారమైనచో, మనో వాక్కాయ కర్మ పరిశుద్ధులమైనచో, దేవతలందరిని మేము తృప్తిపరచి యున్నచో వ్రతాది అనుష్ఠానములు మాచే ఉల్లంఘింప బడనిచో, అనన్య భక్తి మీపై మాకున్నచో, ఆచార్యులను దేవతలను గురువులను భక్తియుక్తులమై మేము సేవించిన వారమైనచో విద్య సత్ప్రవర్తన జ్ఞానము వినయము సద్బుద్ధి ధర్మము సత్యము - వీనిని మేమవలంబించుచున్నచో, పరస్త్రీ కాంక్ష పరద్రవ్య అపహరణ పరహింస మొదలగు దుర్గుణములు లేశమాత్రము మాకు లేనిచో, కామాది అరిషడ్వర్గములు మేము జయించిన వారమైనచో సర్వభూత దయాపరులమైనచో, నీవు మాకు ప్రసన్నుడవగు"మని ప్రార్థించిరి.

వారి ప్రార్థనలు విన్న మహావిష్ణువు వారి ఎదుట ప్రత్యక్షమై ప్రీతితో "నాయనలారా! మీవంటి వైష్ణవులు లోకమున లేరు. ప్రసన్నుడనైతిని. మీ కోరిక నెరవేర్చెదను." అని పలికెను. భగవంతుని మాటలు విన్న ఋషులు "ప్రభూ! మాయందు మీ అనుగ్రహ మున్నచో ఈ ఔర్వునికి పుత్ర సంతానము అనుగ్రహింపుము" అని వేడుకొనిరి. అప్పుడు భగవంతుడు "ఓ మహర్షులారా! జంబూద్వీపమునందు హనుమత్పర్వతము నా నివాస భూమి. దాని శిఖరములను దేవఋషులు సనకాదులు సేవించుచుందురు. ఆ పర్వతమున దక్షిణ శిఖరము నా నివాస స్థానము. బంగారుతో చేయబడిన హేమకోటి విమానమని దాని పేరు. పూర్వము హిరణ్య కశిపుని సంహరించుటకై దేవతలు నన్ను ప్రార్థింపగా నరసింహ రూపమును ధరించి వానిని సంహరించితిని. దేవతలందరు నరసింహ రూపమున నున్న నన్ను స్తుతించి ఈ రూపమున నన్ను ధ్యానించు వారిని అనుగ్రహించవలెనని ప్రార్థించిరి. అప్పుడు ప్రహ్లాదుడు "స్వామీ! ఈ ఉగ్రరూపమును మాని శాంతరూపముగ ప్రజలకు దర్శనమి"మ్మని ప్రార్థించెను. అందువలన నేను యోగనృసింహుని రూపముగ సాత్విక రూపముతో ఈ హనుమత్ శైలమున భక్తపరాధీనుడనై హేమకోటి విమాన శిఖరము క్రింద ఆవిర్భవించితిని. నా రూపము హేమకోటి విమానమునందు ప్రకాశించుచున్నది. ఎప్పుడు ప్రార్థించిన అప్పుడు ప్రత్యక్షమై భక్తులకు శుభముల నిచ్చుచున్నాను. సనకాదులు వశిష్ఠాది మహర్షులు ఇచ్చట మోక్షార్థులై తపమాచరించిరి. ఆ శిఖరమునకు పశ్చిమమున అత్రియను మహర్షి జితేంద్రియుడై తపమాచరించుచున్నాడు. అతనిని ప్రార్థించిన ఈ ఔర్వుడు పుత్రసంతతి బడయగలడు. నేనుకూడ అత్రిమహర్షికి కుమారుడనై జన్మించితిని. ఔర్వుడచటికి వెళ్ళవలె"నని చెప్పి స్వామి అంతర్ధానము చెందెను.

ఋషులందరు ఔర్వునితో "నీవు భగవంతుని వాక్యములను వింటివి కదా? త్వరగా ఆ పర్వతమున నున్న అత్రి మహర్షి ఆశ్రమమును చేరికొనుము." అని చెప్పిరి. ఔర్వుడు భార్యతో కూడ అత్రి ఆశ్రమమునకు వెళ్ళి అత్రి ప్రభావముతో పుత్ర

సంతతి బడసెను. అచ్చట ఉన్న వజ్ర తీర్థమున స్నానము చేసి అత్రిని సేవించిన వారు పుత్రులను పొందగలరు.

అత్రి మహర్షి కూతురైన శీలవతిని ఉగ్రతపుడు అనుమహర్షి వివాహ మాడెను. అతడు దుష్టుడై పరస్త్రీ ఆసక్తి కలవాడై తామ్రపర్ణి నదీతీరమున నివసించు చుండెను. శీలవతి అతడు దుష్టుడైనను సేవించుచు ఎల్లప్పుడు భర్తకు ఇష్టమైన పనులే చేయుచుండెను. అతనికి పరస్త్రీ సంగమమువలన భయంకరమైన వ్యాధి కలిగెను. నడచుటకు కూడ అతనికి శక్తి లేకపోయెను. అట్టి దశలో కూడ అతనికి వేశ్యల సంగీత నాట్యములయందు కోరిక పెరుగు చుండెను. సంధ్యావందనాది వైదిక కర్మలయందు మనస్సు వర్తింపక వేద శాస్త్రములు మరచిపోయెను. భరింపరాని దుర్వాసన అతని శరీరమునుండి వచ్చుచుండెను. అట్లున్నను శీలవతి భర్తతో మంచి మాటలనే పలుకుచు ప్రీతితో అతనిని సేవించు చుండెను. అతని లాలాజలమును తనచీరతో తుడుచుచుండెను. పురుగులు పడి రక్తము కారుచున్న శరీర రంధ్రములను శుభ్రము చేయుచుండెను. "ఈ వ్యాధికి ప్రతిక్రియ చెప్పగలవారు ఎవరైన కలరా?" అని ఆమె విచారించెను. ఆకాశమునుండి అశరీర వాణి "ఓ బిడ్డా! నీవు భయపడ వలదు. నీ బాధను నేను తొలగించ గలను. నీ భర్తకు నిజరూపము కలుగును. తరువాత నీ భర్త నీ యందే ప్రేమ కలవాడు కాగలడు. ఉత్తర దిక్కునందు హనుమ త్పర్వతము కలదు. దానిని ఘటికాచల మందురు. అచట ఉన్న నీ తలిదండ్రులు అత్రి అనసూయల వద్దకు వెళ్ళుము. జరుగవలసిన కార్యము అచట తెలియగలదు." అని పలికెను. ఇట్లు ఆదేశింపబడి ఆ సాధ్వి తన భర్తను భుజముపై కూర్చుండ బెట్టికొని ఉత్తర దిక్కునకు బయలు దేరెను. భగవంతుడైన నరసింహ స్వామి ఆమెను పరీక్షింపదలచి పర్వతమును దూరముగా నుండునట్లు చేసెను. అనేక సంవత్సరములు ఆమె మార్గమున నడచుచు భర్తను మోసికొని ప్రయాసపడుచు పోవుచుండెను. "వ్యాధి తీవ్రతచే నాభర్త రేపటినుండి దీర్ఘమూర్ఛను పొందునట్లు తోచుచున్నది. మూర్ఛలో ఎంతకాలముండునో తెలియదు. నీ భర్త దీర్ఘాయుష్మంతుడై ఆరోగ్యముతో మంచి రూపమును పొందగలడని ఆకాశవాణి పలికినది కదా? అది సత్య మగునా? శ్రీనృసింహుని పర్వతము ఇంకెంత దూర మున్నదో కదా? ఈ ఘోరారణ్యమున నా భర్త నెట్లు సేవించ గలను?" ఇట్లు ఆలోచించి శీలవతి భర్త ఆజ్ఞచే హోమ గుండమును ప్రజ్వలింప జేసి, చేతులు జోడించి "ఓ అగ్నిదేవుడా! నీవు సంతుష్టుడ వైనచో, నాయందు పాతివ్రత్య మున్నచో రాత్రి రాకుండు గాక" అని శపించెను.

ఇట్లు శపించుటచే రాత్రి వచ్చుటకు వీలు కాలేదు. సూర్యుని నుండి ఎండ వేడిమి వచ్చుచుండెను. సూర్యుని తేజస్సు పెరిగి పగలు ముగియ కుండెను. ఆ సమయమున యజ్ఞములు చేయు ఋషులు ఇట్లు చింతించిరి. "జ్యోతిష్టోమాది క్రియా

కలాపములు దిన సంఖ్య లేనివైనవి. అందువలన లోకమున ఋషులు యజ్ఞములు చేయలేకున్నారు. దుష్టులైన మందేహాది రాక్షసులు బ్రాహ్మణులచే అర్ఘ్యములు విడువబడ నందున బలగర్వితులై ఇంద్రుని, మరుద్గణములను త్రోసి వేయగలరు. ఇది గాక కుబేరుడు, జలాధిపతియైన వరుణుడు మొదలగు వారిని తొలగించి అధికారముల చేపట్టెదరు. బ్రాహ్మణులు విడచు అర్ఘ్యములు లేనందున దుష్టచింతలు కలుగును. సంధ్యాసమయములలో బ్రాహ్మణులు గాయత్రీ మంత్రముచే అభిమంత్రించిన నీటిని మూడు పర్యాయములు పైకి చల్లెదరు. (మూడు అర్ఘ్యములు వదలుదురు). ఆ నీరే వజ్ర సమానమై మందేహులను కొట్టి వేయుచున్నది కదా! మంత్రముతో పవిత్రమైన అర్ఘ్యములు లేనందున గర్వముతో రాక్షసులు జనులను కూడ బాధించగలరు" అని చింతించిరి. ఆ ఋషుల ప్రార్థనల విన్న బ్రహ్మవిష్ణుమహేశ్వరాది దేవతలు హనుమత్పర్వతమున నృసింహుడున్న చోటు చేరిరి. పశ్చిమ శిఖరము మీద నున్న అత్రి అనసూయాదంపతులను చూచి ఇట్లనిరి. "ఓ పుణ్యదంపతులారా! మీ పవిత్ర చరిత్రము, దాంపత్యవ్రతము మమ్ములను సంతసింప జేసినవి. మీ తపస్సు నృసింహుని ఆశ్రయించి నందువలన ఫలించినది. మీ ఎదుట నారాయణాది దేవతలు ప్రత్యక్షమైనారు. మీ తపోబలముతో లోకక్షేమము కలిగించ వలెనని వారు కోరుచున్నారు. శీలవతి యను మీ కుమార్తె భర్త మూర్ఛ చెందునను అనుమానముతో రాత్రిని రాకుండునట్లు శపించినది. అది మొదలు మందేహులు పూర్వ వైరమును స్మరించి దేవ బ్రాహ్మణులను బాధించుచున్నారు. శీలవతి యగు మీ అమ్మాయిని శాంతింప జేసినచో ఆమె సంతసించిన రాత్రి ఏర్పడ గలదు." ఆ మాటలు విన్న అనసూయ వారికి నమస్కరించి తన కూతురు వద్దకు వెళ్ళి ఇట్లనెను. "అమ్మా! నీవు రాత్రిని శపించితివి. శాపమును ఉపసంహరించు కొనుము. లేకున్న ధర్మలోపము కలుగును. బ్రహ్మాది దేవతలు కూడ నీకు మేలు కలుగునని చెప్పుచున్నారు". ఇట్లు అనసూయచే బోధింపబడిన శీలవతి "అట్లే అగుగాక" అని శాపవిముక్తి చేసెను. ఆ క్షణముననే ఆమె నృసింహ శైలమును దర్శించ గలిగెను. బ్రహ్మాది దేవతలు అత్రి అనసూయలతో ఇట్లనిరి. "అమ్మా! విష్ణువు రుద్రుడు బ్రహ్మ అగు మేము నీయెడ ప్రసన్నులమైతిమి. మేము ముప్పురము నీకు కుమారులమై జన్మించ గలము. ఇక్కడ వజ్ర సరస్సు నందు స్నానము చేసి తపము చేసిన వారికి పుత్రసంతతి కలుగును." అని చెప్పి అంతర్ధానమైరి. తరువాత దూర్వాసుడు ఈశ్వరాంశతోను, దత్తాత్రేయుడు విష్ణ్వంశతోను, చంద్రుడు బ్రహ్మ అంశతోను అత్రికి పుత్రులుగా పుట్టిరి. శీలవతి భర్త యగు ఉగ్రతపుడు ఆ వజ్రసరస్సున స్నానము చేసి సమస్త పాపములు నశించగా వజ్రకాయుడై ప్రకాశించెను. కావున ఎవరు భార్యతో కూడి వజ్రసరస్సున స్నానము చేయుదురో వారు పుత్రవంతులై దీర్ఘాయుష్మంతు లగుదురు.

ఈ వజ్రతీర్థమునకు తూర్పున భరద్వాజుని ఆశ్రమము కలదు. అది చాల మనోహరముగా నున్నది. పూర్వము రఘువంశమునకు చెందిన భరతుడు తన అన్నయగు శ్రీరాముని భార్యను అనగా సీతమ్మను రావణు డపహరింపగా శ్రీరాముని సహాయార్థము చతురంగ బలములతో తమ్ముడైన శత్రుఘ్నునితో కూడి ఇచ్చటికి వచ్చెను. సైన్యమును దూరముగా నిలిపి అత్రిమహర్షిని దర్శించెను. ఆ మహర్షి భరత శత్రుఘ్నులను ప్రేమతో ఆదరించి సైన్యముతో వచ్చిన వారందరికి ఆతిథ్యము నొసగెను. భరతుడు వచ్చుటకు కారణము తెలిసికొని భరద్వాజుడు "నాయనా! మీ అన్న ధర్మాత్ముడు. నీతి కోవిదుడు. రావణుని యుద్ధమున సంహరించి తన భార్యతో తిరిగి రాగలడు. నీవు పెద్దల ఆజ్ఞానుసారము రాజ్యమును రక్షించుము. నేను ఈ రోజే అగస్త్యునితో కలసి రామరావణుల యుద్ధము చూచి వచ్చితిని. నీవు నీపురమునకు వెళ్ళుము." అని ఆశీర్వదించెను. ఈ మాటలు విన్న భరతుడు "స్వామీ! ఇంత గొప్ప సేనకు మీరు ఆతిథ్యము నిచ్చితిరి. ఇది ఎట్లు సంభవమైనది? నాకు ఆశ్చర్యముగా నున్నదని ప్రశ్నించెను." భరద్వాజు డిట్లనెను. "ఓ రాజా! శ్రీనృసింహ పర్వతము మీద శ్రీమహావిష్ణువు లక్ష్మితో కూడ నృసింహ రూపమున ప్రకాశించుచున్నాడు. ఆ పర్వతమున కుత్తర దిక్కున నేనున్నాను. అక్కడ ఉన్న కల్హారమను సరస్సున స్నానము చేసి తపస్సు చేసిన వారు ఏమి కోరినను పొందగలరు." అది విని భరతుడు "స్వామీ! ఈ నృసింహ శైలము చింతామణి అని భావింప వలసినదే" అనెను. తరువాత భరతుడు తమ్మునితో కూడ అగస్త్యుని సేవించి అయోధ్యకు వెళ్ళెను. అది మొదలు ఈ ఘటికాచలమునకు చింతామణి (కోర్కెల దీర్చు మణి) అనుపేరు వచ్చెను. ఎవరు కల్హార సరస్సునందు స్నానము చేసి నృసింహుని సేవింతురో వారు నిత్యతృప్తులగుదురు.

అగస్త్యుడు ఇంకను ఇట్లు తెలిపెను. "సురథుడను ధర్మాత్ముడైన రాజు ధర్మబద్ధముగా ఇప్పుడు పాలించుచున్నాడు. తరువాత ఇంద్రద్యుమ్నుడను రాజు ఈ పురమును పాలించును. వసంతకాలమున గ్రీష్మములో మార్గ శీర్షములో ఫాల్గున మాసములలో గొప్ప ఉత్సవములు జరుగును. పూర్వము సప్త ఋషుల చేత ఏడు మహోత్సవములు జరుపబడినవి. 5 విగ్రహములకు ఈ ఉత్సవములు జరుపబడును. ఇక్కడ వైఖానసు లర్చకులై యుందురు. ఆగమ కోవిదులైన వైఖానసులు శ్రీనృసింహునికి ప్రీతి పాత్రులు.

ఇచ్చట దీర్ఘ సరస్సు కలదు. దీని యందు పెద్ద తామరపూలు కలవు. సరస్సు చుట్టు పెద్ద చెట్లు కలవు. ఇందు స్నానము చేయువారు దీర్ఘాయుష్మంతు లగుదురు. ఈ సరస్సు వద్దకు గంధర్వులు మరుత్తులు కిన్నరులు యక్షులు గుంపులు గుంపులుగా వచ్చి ఆనందింతురు. ఇక్కడి ఆశ్రమముల యందు నృసింహ క్షేత్రములు గలవు. వీటి నన్నిటిని ప్రదక్షిణము చేసిన వారు సమస్త పాపములనుండి విముక్తులు కాగలరు.

నృసింహ అనుగ్రహముతో దీర్ఘాయుష్మంతులై సమస్త సౌఖ్యములు పొంది సత్కీర్తి బడయ గలరు. పై విధముగా క్షేత్రమాహాత్మ్యమును గురు ముఖము నుండి విన్నవారు శ్రీహరి అనుగ్రహముతో ఆయుస్సును విద్యను కీర్తిని ముక్తిని కూడ పొందుదురు."

## పదమూడవ అధ్యాయము

తరువాత అగస్త్యుడు వామదేవునకు ఆంతర ప్రదక్షిణమును గురించి వివరించెను. ఈ ప్రదక్షిణము చేసిన గొప్ప సంపద కలుగును. బ్రహ్మ ఈ తపస్సు చేసి సృష్టి కర్తృత్వమును, కుబేరుడు ధనపతిత్వమును, ఇంద్రుడు స్వర్గాధిపత్యమును పొందిరి. విశ్వామిత్రుడు కోరిన ఫలమునకై శిష్యులతో కలసి బ్రహ్మతీర్థమున స్నానము చేసి తపస్సు చేసెను. పురుషార్థముల కోరువాడు భైరవ తీర్థములో స్నానము చేయవలయును. తరువాత హలావతి యందు తపస్సు చేయవలయును. అటుపై గౌతమ తీర్థమున స్నానము చేయవలయును. దాని కుత్తరమున మహా వనము కలదు. దానియందు భల్లూక రాజైన జాంబవంతుడు తపస్సు చేయుచున్నాడు. ఆ ప్రాంతమునందే శ్రీకృష్ణుని వివాహమాడిన జాంబవతి అను కన్య ఉండెడిది. పూర్వము కృష్ణుని భర్తగా పొందుటకై వాయుదేవునిచే ప్రేరేపింపబడిన జాంబవతి తీవ్రమైన తపస్సు చేసెను. ఆమె ఆహారము మాని తపస్సు చేయుచుండగా ఆమెను చూచిన వరాహము ఇట్లనుకొనెను. "ఆహా! ఎనిమిది సంవత్సరములు గల ఈ కన్య అసాధ్యమగు తపస్సు చేయుచున్నది. ఇట్టి తపస్సు దేవతలు కూడ చేయలేరు. నీరు, ఆకు, పండు, కందమూలము ఏదియో ఒకటి ఇట్టి తపస్వినులకు ఆదరముతో ఇవ్వవలయును. ఇక్కడ మంచి కందమూలము గల తీగలు కన్పించుచున్నవి. దీనిని పెకలించి ఈమెకు ఇచ్చెదను." ఇట్లు ధర్మమార్గమున ఆలోచించిన వరాహము తన చేతులతోను మొట్టెతోను కాళ్ళతోను భూమిని ఘుర ఘురమని శబ్దముచేయుచు త్రవ్వెను. పెద్ద కందకము చేసి తీగను మెల్లగా పైకి లాగ ప్రయత్నించెను. ప్రక్కన ఉన్న ఒక పెద్ద రాయి ఆకంద మూలము పైకి రాకుండ అడ్డుపడెను. తీగతెగిపోయెను. వరాహము తన మొట్టెతో రాతిని పైకెత్తి చేతులతో ఆ కందమూలమును బయటికి తెచ్చెను. ఆ రాయి తొలగించుట వలన అచ్చట క్రొత్తగా జలధార పుట్టెను. వరాహము ఆ రాయి క్రింద ఉన్న నీటి బిలము నుండి ఆకుడొప్పలో నీటిని కందమూలమును తీసికొని నిరాహారయైన జాంబవతి కిచ్చెను. తన స్నేహితురాండ్రు ఆహార శయ్యాదులు సమకూర్చినను ఇష్టపడని జాంబవతి వరాహము తెచ్చిన ఈ ఆహారమును చూచి వరాహరూపుడయిన భగవంతుడు తెచ్చెనా అని భావించెను. "ఓ వరాహమా! నీ వీపని ఎట్లు చేయగలిగితి"వని ప్రశ్నించెను. వరాహ మిట్లు తెలిపెను.

"పూర్వము దండకారణ్య సమీపమున వరాహధ్వజుడను రాజు ఉండెను. నే నతని పెద్ద కుమారుడను. నా పేరు సింహధ్వజుడు. నా తండ్రి యందు మిక్కిలి

గౌరవము కలిగి యుంటిని. నా తండ్రి నన్ను యువరాజుగా చేసెను. ఒకనాడు పరిజనులతో వేటకు బయలుదేరితిని. నేనొక వరాహమును చూచి వెంటబడితిని. అది భయముతో పరుగెత్తి తండు డను ముని ఆశ్రమములో దూరెను. ఆ ముని కోపించి నన్ను వరాహము కమ్మని శపించెను. ఈ విషయమును విన్న మా తండ్రి సపరివారముగ వచ్చి వినయముతో "స్వామీ! నా కుమారుడు అజ్ఞానముతో మీ ఆశ్రమము ప్రవేశించెను. క్షమించి శాప విముక్తుని చేయు"మని ప్రార్థించెను. ఆ మహర్షి "రాజా! బ్రహ్మాదులైన దేవతలు కూడ నా శాపము తప్పించుకొనలేరు. నీవు వచ్చి ప్రార్థించుచున్నావు కనుక శాపవిమోచనమును తెలుపుచున్నాను. పయోష్ణమునకు ఉత్తరమున శ్రీనృసింహ పర్వతము కలదు. నీ కుమారుని అచ్చట విడచి పెట్టుము. వరాహరూపమున ఉన్నను పూర్వజన్మ జ్ఞానము కలవాడై ఉండగలడు. అచ్చట జాంబవంతుని కూతురు తపస్సు చేయుచున్నది. ఆమెకు సేవ చేయదలచినప్పుడు నీ కుమారుడు ఆమెవలన శాపవిముక్తిని పొందగలడు. మహావరాహుడైన భగవంతుని యందు లీనము కాగలడు. ఆలోచన చేయకు"మని ఆ ముని అంతర్ధానము చెందెను. నన్ను మా తండ్రి దయతో ఇచ్చట విడచెను. చాలకాలము తరువాత నిన్ను చూడగలిగితిని. దైవ వశాత్తు ఈ తీగతో పాటు జలధార పడినది. ఈ కందమూలమును నీటిని తీసికొనుము" అని కోరెను. అప్పుడు జాంబవతి "ఓ వరాహమా! నీ మొట్టెచేత ఈ సరస్సు ఏర్పడినది. దీనికి వల్లీ తీర్థము, శిలాతీర్థము, వరాహతీర్థము అని మూడు పేర్లు ఉండును. ఈ నీరు రుచికరమై స్వచ్ఛమై అందరికి ఉపయోగపడగలదు. దీనిలో స్నానము చేసినవాడు, తీర్థమును త్రాగినవాడు, తపమాచరించినవాడు మహావరాహరూపుడైన శ్రీ మహావిష్ణు స్థానమును పొందును." అని చెప్పెను. ఇట్లు చెప్పుచుండగనే భగవంతుడైన మహావిష్ణువు శ్వేత వరాహరూపముతో, ఘుర్ఘురధ్వనులతో, బ్రహ్మర్షి దేవర్షి ద్విజర్షి గణములు సేవింపగా ఆవిర్భవించెను. భగవంతుడు జాంబవతితో ఇట్లనెను. "మనోవాక్కాయ కర్మలతో శుద్ధమైన మనస్సుతో నీవు చేసిన తపస్సునకు నేను సంతసించితిని. నీ కోరికను తీర్చెదను." జాంబవతి వరాహరూపి యగు భగవంతుని ఇట్లు స్తుతించెను.

**మహావరాహ భవతే దంష్ట్రినే భగవన్నిదమ్,**
**మనః ప్రయచ్ఛ త్వయ్యేవ భక్తిషు వ్యభిచారిణీమ్.**
**త్వమేవ బ్రహ్మ పరమ మాపో జ్యోతి రనామయమ్,**
**అనిలశ్చ తథా వ్యోమ భవాన్ భక్తై ర్నిగద్యతే.**
**యచ్చకించి జ్జగ త్సర్వం దృశ్యతే శ్రూయతేపివా,**
**అంత ర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః.**
**ఉత్పన్నాన్ సకలాన్ వేదాన్ ఉద్ధర్తుం ప్రార్థితో బుధైః,**
**అవతీర్ణో భవేద్యస్తు తస్మై మత్స్యాత్మనే నమః.**

భారా సహా ధరిత్రీతి ప్రేరితో దైవతై స్స్వయమ్,
అవతీర్ణో భువః పృష్ఠే తస్మై కూర్మాత్మనే నమః.
సముద్రాంతరితాం భూమి ముద్ధర్తుం బ్రహ్మణేరితః,
ముముక్షు ర్వారిధిం తస్మై వరాహవపుషేనమః.
ప్రహ్లాదప్రీతయే దైత్య రాజం హంతుం య ఉద్యతః,
ఆవిర్భూతో మణిస్తంభే తస్మై సింహాత్మనే నమః.
మహా బలేస్తు దైత్యస్య మాన భంగాయ యఃపుమాన్,
యాచతే త్రిపదం లోకే నమస్తే వామనాత్మనే.
యః ప్రీతయే పితు ర్యృద్ధే కర్తుం క్షత్రవిదారణమ్,
భిభర్తి పరశుం హస్తే తస్మై రామాత్మనే నమః.
పితుర్వచన రక్షార్థం సభార్య స్సానుజో వనమ్,
సంప్రాప్తో యస్తు భగవాన్ తస్మై రామాత్మనే నమః.
ప్రలంబాసుర భంగాయ ప్రార్థితో యస్స్వయం హలమ్,
భిభర్తి యో విష్ణురూపః తస్మై రామాత్మనే నమః.
జన్మక్షణే చతుర్బాహుం శంఖ చక్ర గదాధరమ్,
నందో ననందయం దృష్ట్వా తస్మై కృష్ణాత్మనే నమః.
సర్వానపి మహాదైత్యాన్ హేషయా భీషయన్ బలీ,
యః పుమా నావిరభవత్తస్మై కల్క్యాత్మనే నమః.
బ్రహ్మాత్వం చా ప్యణు స్త్వంహి సత్య స్త్వం సవితా విభుః,
త్వం సోమస్త్వం యమోరుద్ర స్త్వంవిష్ణు స్త్వం ప్రజాపతిః.
త్వం యజ్ఞ స్త్వం వషట్కార స్త్వం బ్రహ్మ త్వం ప్రజాపతిః,
నమః ప్రసీద భగవన్ మహాపోత్రి వపుష్మతే.
ఘోరాయ దంష్ట్రిణే తుభ్యం వాసుదేవాయ విష్ణవే.

ఇట్లు స్తోత్రము చేయగా భగవంతుడు ప్రేమతో "ఓ కన్యా! నీ మనసులో నున్నది నాకు తెలియును. నీ కోరిక నెరవేరును. శ్రీకృష్ణుని భర్తగా పొంది సుఖముగా నుందువు. ఈ భీకరారణ్యము నీకు ఆనందాయకముగా నుండగలదు." అని ఆశీర్వదించెను. "ఈ (జాంబవతి) ఆశ్రమమున నివసించు మానవునకు కోరిన కోర్కెలు సిద్ధించును. ఈ పుష్కరిణి తీరమున నేనుండి భక్తుల కోర్కెలను తీర్చుచుండెదను. ఉత్తరాయణ

దక్షిణాయన పుణ్యకాలముల యందును, విషువత్తులలో (అనగా రాత్రి పగలు సమానముగా నుండు దినములలో) సూర్య చంద్రగ్రహణ సమయములలో ఇక్కడ స్నానము చేసినవారు జీవన్ముక్తు లగుదురు. ఇచట దేవతలను పితృదేవతలను సేవించినవారు స్వర్గప్రాప్తిని బడయ గలరు. పాపవిముక్తులై నా భక్తిని పొందుదురు." ఇట్లు చెప్పి భగవంతుడు అంతర్ధాన మందెను. భగవంతుని ప్రీతిపాత్రురాలైన జాంబవతి తన తండ్రి ఆశ్రమమునకు వెళ్ళెను. ఈ వరాహ తీర్థమున ప్రాతః కాలమున గాని, మధ్యాహ్నమున గాని స్నానము చేసిన వారికి మహా వరాహ అనుగ్రహముతో అన్ని కోర్కెలు ఫలించును. ఇచ్చట ప్రతి మానవుడు స్నానము చేసిన తరువాత పాండవ తీర్థమున స్నానము చేయవలయును. దీనికి తూర్పున హనుమత్తీర్థమున్నది. ఇచ్చట శంఖ చక్రములు ధరించిన హనుమంతుడు కలడు. హనుమంతునికి ప్రదక్షిణము చేసి హనుమంతుని అనుగ్రహము పొందవలయును.

## పదునాల్గవ అధ్యాయము

అగస్త్యుడు వామదేవునితో ఇంకను ఇట్లనెను. హనుమత్తీర్థమునకు దక్షిణమున ఉన్న కొండ లోయలో కపిలుడు పంచాగ్ని మధ్యమున తీవ్రమైన తపస్సు చేయుచున్నాడు. అతని భార్య ధర్మవ్రత మహాపతివ్రత. లక్ష్మి విష్ణువును, పార్వతి శివుని, సరస్వతి బ్రహ్మను వీడక ఉండునట్లు ఎల్లప్పుడు భర్తనే ఆశ్రయించి ఉండును. ఆమె ఒక గంపను గునపమును తీసికొని ఒకనాడు కందమూలములను తెచ్చుటకై వెళ్ళెను. కొండపై ఉన్న అడవులలో కందమూలములను త్రవ్వుచుండెను. ఆ కొండ శిఖరముపై నూర్లకొలది వెలగపండ్లు ఉండుట చూచి వాటిని తీసికొనుటకు పోయెను. అచ్చట ఒక పులిని చూచెను. అయినను ఆమె ఆ వెలగపండ్లను తీసికొనునప్పుడు నేనీ పండ్ల నిచ్చెదను. నా వ్రతము పూర్తి అగును. అటుపై నన్ను తినవచ్చును." అని తెలిపెను. ఈ మాటలు విన్నపులి "అమ్మా! నీవు త్వరగా వెళ్ళిరమ్ము. ఆలస్యమును సహించలేను. నీకెదురు చూచి ఘడియ తరువాత ప్రాణములు విడచెద"నని చెప్పెను. అప్పుడు ధర్మవ్రత కాశ్యపవంశజుడైన తన భర్త పుండరీక సరస్సు తీరములో దూరమున ఉన్నా"డనెను. అది విని పులి "పుండరీక సరస్సు ఎక్కడ ఉన్నది? నాకు చెప్పుము. ఆ పేరు వినగానే నాకు చాల ఆనందము కలిగినది. ఆకలితో ప్రాణము పోవు నాకు ఆ సరస్సు స్మరణముతో ఆనందము కలుగుచున్నది". అని అడిగెను. ఆమె ఆశ్చర్యముతో ఆ పులిని చూచి "ఓ మృగరాజా! ఆ సరస్సు పేరు విన్న వెంటనే నీవు చాల సంతోషించుచున్నావే, ఎందువలన?" అని ప్రశ్నించెను. పులి ఇట్లు బదులు చెప్పెను. "పూర్వము నర్మదానదీ తీరమున చాలమంది మహర్షులు తపస్సు చేయుచుండిరి. అప్పుడు పూర్వ పాపము వారిని పీడించ సాగినది. పాపము వలన వారు కుతర్కవాదము నవలంబించిరి. వారి తపస్సున కది విఘ్నము కలిగించెను. అక్కడికి మా తండ్రియగు

ధర్మవ్రతుడను విష్ణు భక్తుడు విధివశాత్తు వచ్చెను. నర్మదా నదిలో స్నానము చేసి మాధ్యాహ్నికమును ముగించెను. భార్యా శిష్యులతో ఆశ్రమములో ప్రవేశించెను. అక్కడ 36 మంది తర్కవిద్యా నిపుణులను, కలతపడుచున్న బుద్ధికల బ్రాహ్మణులను చూచెను. మా తండ్రి మోదుగ పుల్లలకై అచటికి పోయెను. అక్కడికి పోయిన వెంటనే అతనికి వారి కుతర్కము వినబుద్ధి పుట్టెను. మోదుగ పుల్లను ఘడియసేపు సేకరించు కాలమున వారి కుతర్కమును వినెను. అందువలన పంచయజ్ఞములు, తపస్సు, వ్రతములు ఆచరించవలెనా యని సందేహించెను. ఇట్లు అన్ని సత్కర్మలయందు అనాసక్తుడయ్యెను. ఇట్లు ఒక నెలరోజులు వేదవేదాంత విద్యలకు దూరమై కేవలము తర్క విద్యయందు మనస్సు నిలిపి కుతర్కముచే చెడు మాటలు మాటలాడుచుండెను. శిష్యుడు కూడ కుతర్కవాదిగా మారెను. భార్యతోను శిష్యునితోను నా తండ్రి తన గురువైన వ్యాసుని కడ కేగెను. వ్యాసుడతనిని చూచి "నాయనా! వైదిక విద్యను వదలి చెడు విద్యల నాశ్రయించితివి. అందువలన నీవు భార్యా శిష్యులతో పులివయ్యెదవు. అట్లున్నను నీకు పూర్వజన్మ జ్ఞానముండగలదు. యోగానంద నృసింహుడున్న ఆ పర్వతమున ఉండుము. ఎండిన ఆకులను తినుచు తపస్సు చేయుము. ఏకాగ్రమైన విష్ణు భక్తి వలన శ్రీనృసింహదేవుడు ప్రత్యక్షమై నీకు ఉత్తమ లోకములు ప్రసాదించును" అని చెప్పెను. శాపగ్రస్తుడైన మా తండ్రి గురువునకు నమస్కరించి సిగ్గుతో ఈ పర్వతము చేరెను. సప్త ఋషులను హృదయమున ధ్యానించి శ్రీనృసింహుని ధ్యానము చేయుచున్నాడు. ఎండిన ఆకులు కందమూలములు తినుచు ఎవ్వరిని భయపెట్టక తపస్సు చేయుచుండగా వారికి నేను కొడుకునై పుట్టితిని. పుండరీక వనమునందు పూర్వ జన్మ జ్ఞానము కలవాడనై పండ్లను మాత్రము తినుచు బాల్యము గడపితిని. చాలకాలమునకు తపస్సు చేయుచున్న మా తలితండ్రులకు శ్రీనృసింహుడు దర్శనమిచ్చి వారిని ఉద్ధరించెను. ఎచ్చట ధర్మాత్ముడై పుండరీకమై (పులి) జితేంద్రియుడై, తపస్సు చేసెనో అచ్చటనే నృసింహుడు దర్శనమిచ్చెను. అతడు తనపేరిట పుండరీక తీర్థము కల్పించెను. అందు స్నానముచేసిన వారికి పూర్వజన్మ స్మృతి కలుగును." ఈ మాటలు విన్న ధర్మవ్రత సంతోషముతో ఇట్లు ప్రశ్నించెను. "నీవు పులివై యున్నావు. పూర్వజన్మ జ్ఞానము నీకెట్లు కలిగినది?" ఆ ప్రశ్నకు సమాధానముగా పెద్దపులి ఇట్లు తెలిపెను. "పూర్వము గంధర్వ నగరమున చిత్రరథుడను రాజుకలడు. అతనికి 14మంది కుమారులు. వారికి వీణా విశారదుడైన నారదుని గురువుగా చేసెను. అప్పుడు నేను నారదుని నోటినుండి వీణనుండి వచ్చిన నిషాదము మొదలగు స్వరములను తెలిసికొంటిని. నారదుడు "శ్రుతి భేదము లెట్లు కలుగును?" అని ప్రశ్నించెను. నేను తెలిసినను దురహంకారముతో వేదములను నిందించితిని. కోపముతో నారదుడు "దుర్మార్గుడా! సాంగోపాంగముగా స్వర భేదములను వేదములను చదువుకొన్నను,

వానిని నిందించుచున్నావు. నీవు భూమిపై పెద్దపులి వగుదువు గాక. హనుమత్ శైలమున తిరుగుచుండుము. పులికి జన్మించియు పూర్వజన్మ జ్ఞానము కలిగి యుందువు. కశ్యపుని భార్యకు ఈ విషయము తెలుపునప్పుడు నీవు విముక్తుడవగుదువు. అప్పుడు బంగారుఛాయతో విమానము నెక్కి ఆమె ఆశీస్సులతో ఇచ్చటికి రాగలవు." అని శాపవిమోచనము తెలిపి వెడలిపోయెను. "అమ్మా! విష్ణుభక్తురాలైన నిన్ను చూచుట చేత ఈ శరీరమును విడచి దివ్యశరీరము పొందగలను" అని పలికి గంధర్వరూపమును పొందెను. ఆమె ఆశ్చర్యముతో చూచుచుండగా "అమ్మా! విష్ణుభక్తుల సాంగత్యముతో ఈ జన్మనుండి విముక్తుడ నైతి"నని చెప్పి అతడు వెడలిపోయెను.

ఆశ్చర్యచకితురాలైన ధర్మవ్రత ఆశ్రమమునకు పోయి, భర్తకు జరిగిన వృత్తాంతము వివరించెను. వారు పుండరీక సరస్సు ఒడ్డున నివసించి నృసింహుని సేవించుచున్నారు. కావున ఈ తీర్థమున స్నానము చేసినవారు పూర్వజ్ఞానము కలవారై విష్ణులోకమును చేరగలరు. ఇచ్చట సూర్యుడు వృశ్చిక రాశి యందు ఉన్నప్పుడు దానము చేసినవారు పాప విముక్తులై జీవన్ముక్తు లగుదురు.

దీనికి దక్షిణ భాగమున సర్వదేవతా ఋషి సేవితమైన ఒక శిఖరము కలదు. దానికి దక్షిణమున ఒక మఱ్ఱిచెట్టు కలదు. దాని కొమ్మలకు వ్రేలాడుచు ఋషులు నరసింహుని ధ్యానించుచుందురు. గిరిప్రదక్షిణము చేయునపుడు ఆ వృక్షమునకు నమస్కరింప వలయును. అక్కడనే గరుత్మంతుడు కలడు. దానికి పశ్చిమదిక్కున ధర్మసుతుడు అను ముని భార్యతో కలిసి తీవ్రమైన తపస్సు చేయుచున్నాడు. ప్రదక్షిణము చేయు మానవులకు ఇచట చల్లని గాలులు వీచి శ్రమను పోగొట్టుచున్నవి.

## పదునైదవ అధ్యాయము

అగస్త్యుడు వామదేవునికి ఇట్లు తెలిపెను. ఆ మఱ్ఱిచెట్టునకు ఉత్తర దిక్కుగా జ్ఞానవంతులైన మహామునుల ఆశ్రమములు కలవు. ఆ ఋషులలో ఒకడైన నిశాకరుడను మహర్షి రోహిణియను ధర్మపత్నితో కాపురముండెను. ఆ మహర్షి శిష్యుడైన కౌత్సుడను వాడు అడవిలో ఒక జింకను చూచి వచ్చి గురువునకు ఇట్లు తెలిపెను. "గురుదేవా! మీరు పంపగా సమీపమున నున్న అడవిలో కందమూలములు త్రవ్వి తెచ్చుటకు వెళ్ళితిని. సమీపమున నున్న మహాతీర్థమున స్నాన సంధ్యలు కావించితిని. అంతట అనేక వర్ణములు గల విచిత్రమైన జింక ఒకటి అందముగా కనుపించెను. అట్టి జింకను గూర్చి ఎప్పుడు వినలేదు కనలేదు. అది ఆ నీటిని త్రాగి వెళ్ళుటకు బయలుదేరెను. ఇటు అటు చూచెను. ఇంతలో తూర్పు శిఖరమునుండి దిక్కులు పిక్కటిల్లునట్లు సింహగర్జన వినిపించెను. వెనువెంటనే గుహనుండి సింహము బయటికి వచ్చెను. చంచల దృష్టిగల ఆ జింకను నేను తాకితిని. తాకిన వెంటనే ఆ జింక కనుపించలేదు. సింహము కూడ

రాక్షస శరీరము ధరించెను. తరువాత వెంట్రుకలు మాత్రము అగుపించెను. తరువాత కాంతిపుంజము అగుపించెను. అటుపై ఆకాశమున 12 సూర్యులు వెలుగునట్లగుపించెను. అనేక విమాన సమూహము లగుపించెను. ప్రశాంత మనస్కులైన వైష్ణవోత్తముల గుంపులు కనిపించెను. వారు బంగారు వర్ణముతో శంఖ చక్రాంకితులై యుండిరి. ఇంద్రజాల విద్యవలె ఇది నాకు అగుపించెను. క్షణము తరువాత అంతయు మామూలుగా కనిపించెను. తరువాత నేను దారిలో ఫలమూలాదులు గ్రహించి వ్యాకులమైన మనస్సుతో తిరిగి వచ్చితిని. స్వామీ! ఈ విశేషమేమియో చెప్పు"డని ప్రార్థించెను.

ఈ మాటలు విన్న నిశాకరుడు మిక్కిలి సంతోషముతో ఇట్లనెను. "నాయనా! నీవు ధన్యుడవు. పూర్వము పుణ్యాతముడను వైఖానసు డుండెను. అతడు నృసింహ సేవాతత్పరుడు. అతని పుణ్యవశమున నృసింహాను గ్రహమున హరిదత్తుడను పుత్రుడు జన్మించెను. కొంతకాలము తరువాత శీలవంతుడు గుణవంతుడు అయిన హరిదత్తుని ఆగమ విద్య నేర్చుకొనుటకు దూర్వాసుని కడకు పంపెను. హరిదత్తుడు కూడ గురువైన దూర్వాసుని సంతసింప జేయుచు విద్యనభ్యసించెను. గురుదక్షిణ లేకుండ విద్యనభ్యసించెనని దూర్వాసుడు కోపించి ఇట్లు శపించెను. "నీవు బుద్ధిమంతుడవు. కులీనుడవు. సత్యసంధుడవు. హరిభక్తుడవు. అయినను దక్షిణలేని విద్యను గ్రహించితివి. కావున కొంతకాలము రాక్షస రూపము నొందెదవు. అరణ్యమున తిరుగుచు అచ్చట ఏ ఏ జంతువులు ప్రసవించునో ఆయా జంతువులలో ఆయారూపమును పొందినవాడవై పాపమును పోగొట్టుకొనగలవు. చివరకు నా అనుగ్రహము వలన నిశాకరుని ఆశ్రమము చేరి పాపనాశన మహాతీర్థమున స్నానము చేసి నృసింహుని సేవతో తరించగలవు." ఈ విధముగా దూర్వాసుని శాపము వలన హరిదత్తుడు అరణ్యమున సంచరించెను. ఏ జంతువు నందు ఏ రూపమున్నదో ఆ రూపమును ధరించుచు నా సమీపమునకు వచ్చెను. అతడు దైవానుగ్రహము వలన ఈ తీర్థమున స్నానమాచరించి స్వామిని సేవించెను. ఆ రాక్షసుడు స్వర్గాపవర్గముల నతిక్రమించి దివ్యరూపమును ధరించి వైష్ణవలోకమును చేరెను. ఈ దృశ్యము నీ ఎదుట జరిగెను. నీవు భాగ్యశాలివి. గురుసేవా తత్పరుడవు. వేదములకును అగోచరుడైన శ్రీ నరసింహుడు నీకు కనుపించెను. మహాత్ములైన శంఖచక్రధరులైన వైష్ణవులు నీకు కనిపించిరి. నీవు ధన్యుడవు." ఇది విన్న కౌత్సుడు గురుపాదములకు నమస్కరించెను. కావున ఈ పాపనాశన మహాతీర్థమున స్నానము చేయువారు పాపవిముక్తు లయ్యెదరు.

దీనికి సమీపమున కౌషేణము అను వనము కలదు. దానిలో ప్రవేశించిన వారికి రోగములన్నియు నశించును. అచట సంజీవకరణి, సంధానకరణి, విశల్యకరణి కలవు. ఆ అడవి మధ్యమున ఉత్తర ముఖముగా ప్రవహించు నది కలదు. దాని తీరమున భగవంతుడైన జాబాలి ఋషి లంబికాయోగ తత్పరుడై యున్నాడు. అచ్చట నృసింహుడు పుష్పమాల ఆభరణములతో అలంకరింపబడి వరదుడయ్యెను.

ఆ నదికి పశ్చిమ తీరమున ఒక అమృత కుండము కలదు. దానియందు పుణ్యాత్ములు మాత్రము స్నానముచేసి నీరు త్రాగగలరు. అందు వేదోక్తమైన నృసింహ అష్టాక్షరి మంత్రము జపించి వైఖానసులు వాలఖిల్యులు పరాశరాది ఋషులు తరించుచున్నారు.

దానికి ఉత్తర దిక్కున ఉన్న కొండపై దత్తాత్రేయ భగవానుడు కలడు. దానికి ఎడమవైపున వామదీర్ఘిక కలదు. అందు దత్తుడు విహరించును. పూర్వము దేవాసుర యుద్ధమున రాక్షసులను జయింపగోరు దేవతలు తమ ధనమును దాచుటకై అగ్నిని సమర్థుడుగా భావించి ధనమును దాచుమని ఇచ్చిరి. అప్పుడు అగ్ని బలవంతులైన రాక్షసులు యజ్ఞము చేయునప్పుడు నేను దీనిని దాచలేను. కనుక వేరొకచోట దాచు"డని కోరెను. అప్పుడు దేవతలు "నీవు విశ్వాత్ముడవు. హవ్యకవ్యముల వహింపగల వాడవు. కనుక నీవే దాచవలె"నని చెప్పిరి. చివరకు అగ్ని అంగీకరించి చాలా కాలము దాచెను. అది తెలిసి రాక్షససేవలు అగ్నిని బాధించిరి. అగ్ని దిక్కులకు పరుగెత్తెను. దైవధన మెక్కడనో జారవిడచుకొనెను. దేవతలు వచ్చి రాక్షసులను జయించిరి. అగ్నిని ధనము నిమ్మని అడిగిరి. ఎన్ని పర్యాయము లడిగినను జవాబు చెప్పక తుదకు మెల్లగా ఇట్లనెను "మీరు ధనము నిచ్చితిరి. దానవులు నా వెంట బడిరి. నేను పరుగెత్తునప్పుడు ఆ ధనమును దక్షిణ దిక్కున జారవిడచితిని. ధనములేని నన్ను జూచి రాక్షసులు నిరాశతో వెడలిపోయిరి. కావున మీరు దక్షిణ దిక్కున ఉన్న భూమిలో ఆ ధనమునకై వెదకుడు' అని చెప్పెను. అన్ని మార్గమును చూపించు చుండగా ఇంద్రాదులు భూమికి దిగివచ్చిరి. ఘటికాచల క్షేత్రమున ఉత్తర దిక్కునకు పోయిరి. వారు "ఇచ్చట సాక్షాత్ నారాయణాంశగల దత్తాత్రేయుడు కలడు. ఆ స్వామి మనకు దారి చూపగల"డని ఇట్లు ప్రార్థించిరి.

**ప్రసీద భగవన్ స్వామిన్ భక్తి ముక్తి ప్రదాయక,**
**పరిపాలయ న స్సర్వాన్ దత్తాత్రేయ నమోస్తుతే.**
**సముద్ర శాయీ భగవాన్ విష్ణు స్సర్వామరైః స్తుతః,**
**అత్రిజ త్వం ప్రసన్నోసి దత్తాత్రేయ నమోస్తుతే.**
**మరు ద్వృధా సరిత్తీరే సన్నద్ధా ముదమావహన్,**
**అర్థితో ముని కన్యాభిః దత్తాత్రేయ నమోస్తుతే.**
**నర్మదా తీర వాసత్వం దృశ్యాదృశ్య వపూరిహ,**
**విమోహయసి విశ్వాత్మన్ దత్తాత్రేయ నమోస్తుతే.**
**అధిత్యకాయాం సంధాస్యతతో యత్పులకావృతమ్,**
**ప్రహర్షయసి గంధర్వాన్ దత్తాత్రేయ నమోస్తుతే.**

జమదగ్నిప్రియా యేన ద్రవీభూతా సురాశినా,
పురానిష్పంద మభవ ద్దత్తాత్రేయ నమోస్తుతే.
నానారూపం సమాస్థాయ వినావర్ణై స్వమాధృతః,
సంప్రీణయసి ధర్మాత్మన్ దత్తాత్రేయ నమోస్తుతే.
భుక్తిం వై భుక్తికామేషు ముక్తిం ముక్త్యభికామిషు,
ప్రదాస్యతి భవానేవ దత్తాత్రేయ నమోస్తుతే.
కేనాపి కామేన భవాన్ తపాంసి కురుతే క్వచిత్,
క్వచి ద్విహరతే రాగీ దత్తాత్రేయ నమోస్తుతే.

ఇట్లు స్తుతింపబడిన దత్తాత్రేయుడు "దేవతలారా! మీ భయమును వీడి మీ కోరిక తెలుపుడు." అనెను. దేవతలు "సూర్యరక్షితమైన వసునామకము మా కులధనమును అగ్ని నుండి రాక్షసులపహరింపబూనిరి. అది ఎచ్చట కలదో తెలియలేదు. మీరే దానిని చూపవలసినది" అని వేడుకొనిరి. అప్పుడు దత్తాత్రేయుడు "ఇక్కడ ఎఱ్ఱరాతి మీద వసునామకమను ధనము కలదు. అది అగ్నినుండి జారిపడినది. నా ఆజ్ఞతో నికుంభుడనువాడు రక్షించుచున్నాడు. మీరు అక్కడకు వెళ్ళుడు. నికుంభుడంతయు తెలుప గలడు." అని ఆజ్ఞాపించెను. ఆ మాటలు విని దేవతలు అచ్చటికి వెళ్ళి ధనమును గ్రహించిరి. దత్తాత్రేయునిచే వసునామకమను ధనము రక్షింపబడినది. ఇది మొదలు ఇచ్చట పూర్ణమైన జలాశయము ఏర్పడెను. ఇది దత్తుని క్రీడా సరోవరము. దీనిని రక్తతటాకమందురు. దేవతల ధనము రక్షింపబడుట వలన దేవసరస్సు అందురు. ఇచ్చట స్నానము చేసినవారు దత్తాత్రేయ అనుగ్రహముతో సర్వ సంపదలను బడయుదురు. సపరివారముగ సకలభోగము లనుభవించి స్వర్గమును పొందగలరు. దేవతలు నృసింహస్వామిని సేవించి స్వర్గమునకు వెళ్ళిరి.

దీనికి తూర్పున గొప్ప అడవి కలదు. ఇచ్చట విశ్వామిత్రుడు నృసింహుని ఆరాధించి బ్రహ్మ తేజస్సును పొందగలిగెను. దీనికి దక్షిణమున వశిష్ఠాశ్రమము కలదు. రాముడు పూర్వము సీత ప్రేరణతో ఆ వశిష్ఠునిట్లు కోరెను. "స్వామీ! నృసింహానుగ్రహముతో నా చరిత్రను చిరస్థాయి అగునట్లు వ్రాసి విష్ణులోకమును పొందగలరు." వశిష్ఠుడు ఇచ్చట నివసించి నృసింహ అనుగ్రహముతో శ్రీరాముని చరిత్ర వ్రాసెను. ఇచ్చట వశిష్ఠ తీర్థము కలదు. ఇందు స్నానము చేసిన వారు విష్ణు సాన్నిధ్యమును పొందగలరు. ఈ అధ్యాయమును చదివినవారు, విన్నవారు బంధుగణములతో విష్ణులోకము చేరగలరు.

# పదహారవ అధ్యాయము

ఇట్లు అగస్త్యుడు ఆంతర మహాప్రదక్షిణములను గురించి చెప్పి "వామదేవా! బ్రహ్మరుద్రాదులు కూడ ఈ ఆంతరప్రదక్షిణము చేసిన వారిని అనుగ్రహింతురు. నీవు ఈ రెండు ప్రదక్షిణములను జితేంద్రియుడవై చేయుము. హనుమత్కామ లాకరములో స్నానము చేసి హనుమంతుని ప్రార్థించిన కోరిన వరము పొందగలవు. అచటనే పితృదేవతలను తృప్తి పరచి నృసింహసన్నిధిని చేరగలవు. ఈ శైలేంద్రమునకు పశ్చిమదిక్కును చేరి అమృతమును నొందగలవు. హనుమంతుని అనుగ్రహముతో సర్వము సిద్ధించగలదు. వేయి మాటలేల? స్తోత్రముతో ప్రసన్నుడైన మారుతి మానవులకు సర్వాభీష్టముల నివ్వగలడు. ఏలనన హనుమంతుడు తన బలము తాను ఎరుగలేడు. ఇతరులు స్తోత్రము చేసినప్పుడు తన బలమును గ్రహించి సూర్యచంద్రాదులను కూడ లెక్కసేయడు. పూర్వము వాయుదేవుడు ఈ పర్వతము మీద అంజనాదేవిని స్పృశించి హనుమంతుని జన్మకు కారణమయ్యెను. పుట్టిన క్షణమునందే ఆకలిగొన్నవాడై బలగర్వితుడైన హనుమంతుడు సూర్యుని చూచి దానిమ్మపండని భావించి గ్రహించుటకై ఎగిరెను. ఆ ఎగురుటను చూచి ఆకాశమున నున్న ఇంద్రాదిదేవతలు భయముతో పరుగెత్తిరి. "ఆహా! ఇదియేమి?" అని ఆశ్చర్య చకితులైరి. అట్లు ఎగురుచున్న హనుమంతుని సూర్యుడు వాయుదేవ ప్రభావమున బాధింపక ఇట్లనెను. "ఆంజనేయా! చిన్నతనముననే ఇంతటి వేగముగల నిన్ను చూచిన నాకు నీ తండ్రియైన వాయువునకు, గరుడునకు కూడ ఇంత బలము లేదనిపించుచున్నది. పుట్టిన వెంటనే ఇంతటి బలసంపన్ను లెవ్వరును లేరు. తండ్రిని మించిన వాడవు. నీకు నేను ప్రసన్నుడనైతిని. దైవికమైన విద్య నొసగెదను. నీ బ్రహ్మచర్యముతో నాల్గు చేతులు పొందగలవు" అని దీవించి సూర్యుడు తన చేతనున్న తామరపూవులో నొకదానిని రసపూర్ణమైన పువ్వును హనుమంతునకిచ్చెను. హనుమంతుడు నమస్కరించి తేనెతో నిండిన ఆ తామరపువ్వును గ్రహించి సంతోషముతో తండ్రి ఆశ్రమము చేరెను. అట్లు తండ్రిచే పెంచబడుచున్న హనుమంతుడు పరాక్రమోపేతుడై దినదిన ప్రవర్ధమానుడయ్యెను.

ఒకప్పుడు హనుమంతుడు బాల్యమున చంద్రునిలోని మచ్చను జింక అని భావించి దానిని పట్టుకొనుటకై ఆకాశమధ్యమున కెగసెను. అట్లు జింక ఉన్నదను భావముతో తన్నుపట్టుకొనవచ్చుచున్న హనుమంతుని పై చంద్రుడు మంచును కురిపించెను. ఆ మంచుచే హనుమంతుడు కప్పబడుట చూచి వాయువు ఆ మంచులో ప్రవేశించి కదలకుండునట్లు చేసెను. ఆంజనేయుడు ఆ మంచును వదలి చంద్రునిపై కురికెను. చంద్రుడు ఇంద్రుని స్మరించెను. వెంటనే ఇంద్రుడు వజ్రాయుధమును ధరించి ఐరావతము నెక్కి వచ్చెను. హనుమంతుడా ఏనుగును చేతితో కొట్టెను. ఏనుగు భయముతో పరుగెత్తెను. కోపముతో ఇంద్రుడాంజనేయునిపై

వజ్రమును ప్రయోగించెను. దానిచే కొంచెముగా దవడ భాగము కొట్టబడుటచే ఆంజనేయునకు హనుమంతుడన్న పేరు వచ్చెను. హనుమంతుడు చంద్రునిపై కురికెను. అతడు అసామాన్యుడని గ్రహించి చంద్రు డిట్లనెను. "ఆంజనేయా! నీవు తీసికొన దలచిన జింక నామచ్చమాత్రమే. అట్లైనను నీ ప్రయత్నము వ్యర్థము కారాదు. నీకు శుభమగు గాక. దేవతలకు అర్హమైన ఈ అమృతమును గ్రహింపుము. నీవు కోరిన దానిని ఈ అమృత ప్రభావముతో పొందగలవు. నీబల విశేషముచే నాకు సంతసము కలిగినది" అని ప్రశంసించెను. "నీ విచ్చిన అమృతము నీవద్దనే ఉంచుము. నేను కోరినప్పుడు ఇమ్ము" అని హనుమంతుడు చెప్పి చంద్రునియందే అమృతము నుంచి తన శైలమును చేరుకొనెను. వామదేవా! నీవు అచ్చటికి పోయినప్పుడు ఈ వృత్తాంతమును స్మరింపుము. అప్పుడు హనుమంతుడు నీవు కోరిన అమృతము నిచ్చును".

ఇట్లు అగస్త్యునిచే బోధింపబడిన వామదేవుడు సంతోషముతో పశ్చిమ దిక్కునకు వెళ్ళి హనుమత్ శైలమునెక్కి సింహ వ్యాఘ్రాది అనేక జంతువులను, సర్ప పక్షి సమూహములను చూచెను. ఐరావత సమానములైన గజ సమూహములను చూచెను. అనేక విశేషములను చూచి తాను ధన్యుడనైతినని భావించెను. ఈ మృగములు హనుమంతుని అనుగ్రహముచే ఎవరిని బాధించుట లేదు. ఇచ్చట దేవగంధర్వులు, కిన్నర కింపురుషులు హనుమత్తీర్థమున స్నానముచేసి హనుమదనుగ్రహముతో ముక్తికై ప్రయత్నించుచున్నారు. "పాపములను పోగొట్టు మాఘమాసము వచ్చినది. ఇచ్చటనే ఉండి ఒక నెల రోజులు తపస్సు చేసెద"నని వామదేవుడు మిగిలిన ఋషిపుత్రులకు తెలిపి అగస్త్యుడు చెప్పినట్లు ముందుగా గిరిప్రదక్షిణము చేసెను. హనుమంతునికి ఉత్తరమువైపు పర్ణశాలను నిర్మించుకొని బ్రాహ్మణ బాలకులతో తపస్సు చేయదొడగెను. కొంతకాలము జరిగిన తరువాత ఆదివారముతో కూడిన మాఘపూర్ణిమ వచ్చెను. ఆనాడు వామదేవుడు ఉదయముననే లేచి, నిర్మల చిత్తముతో హనుమత్తీర్థమునకు వెళ్ళి స్నానము చేసి, మూడు మారులు ఆచమనము చేసి, శుచియై, వినయముతో తూర్పుకు తిరిగి పారిజాత వృక్ష మూలమున ఉన్న పశ్చిమాభి ముఖుడైన బాలహనుమంతుని బొడ్డువరకు గల నీటిలో నిలిచి, వైదికమంత్రములచే ప్రార్థించెను. తరువాత వస్త్రము ధరించి సరస్సు తీరమున హనుమంతుని ఇట్లు స్తోత్రము చేసెను.

**త్వం వై వరేణ్యో హనుమన్ వనౌకసాం త్వం కీర్తనీయ స్సతతం మహీభువా,**
**త్వం శ్లాఘనీయో రఘువంశ కేతునా త్వం నందనీయోసి దివౌకసాం గణైః.**
**అశోకవన్యాం త్వ మశోక దాతా త్వం అక్షహంతా త్వమనింద్య విక్రమః,**
**త్వం గోష్పదీభూత మహార్ణవోసి త్వం మంత్ర వేద్యస్తుత వేగలాంఛనః.**
**రక్షః పుర ద్వార కృతావతార లంకాభిదం కాతరితోంగుళిక్రమాత్,**

నిరర్గళం సారి పురీ ప్రవేశితా తస్మైనమో మారుతయే మహాత్మనే.
సంపాతి వాక్యేన వనౌకసాం స్తవై ర్నిరస్య విఘ్నాన్ పథి భవ్యశాలినా,
విలంఘితో యేన మహా పయోనిధి ర్నమో నమస్తే మహతే హనూమతే.
వాలాగ్ర నిష్ప్యూత మహానలేన యో లంకాం నిరాకార మహా న్నిరంకుశమ్,
మహీభువం ప్రీణయతి స్మ జానకీం నమో నమస్తే మహతే హనూమతే.
హిరణ్యనాభః పథితాడితోపిసన్ యం రామదూతం సమనందయత్పురా,
ఫలైశ్చ పుష్పైరపి సాధయన్ గిరా నమో నమస్తే మహతే హనూమతే.
ముక్తాట్టహాసాన్ విరచయ్య మంత్రజాన్ కుమార మక్షంచ మృధే ప్రసహ్యావై,
వినిష్పివేష ప్రసభంచ తద్వనం నమో నమస్తే మహతే హనూమతే.
జని క్షణాదేవ శశి ప్రభాకరౌ జవాతిరేకా ద్బలవాన్ నిరస్య తౌ,
స్తుత స్తు తాభ్యా మథ తన్మహిం గతో నమోనమస్తే మహతే హనూమతే.
విదేహ కన్యా చికురే పరిష్కృతం మణిం సమాదాయ విలంఘ్య చార్ణవమ్,
ప్రదాపయామాస రఘూద్వహాయ యో నమో నమస్తే మహతే హనూమతే.
కృత్వాభిషేకం తరుణాంబు ధారయా దృఢాంకపాళీమపి రాఘవేశ్వరః,
యస్మై దదాతీ తరమృగ్య మన్వహం నమో నమస్తే మహతే హనూమతే.
వచోనురోధేన పురా మహామృధే వర్షీయసో జాంబవతో మహౌషధీః,
ప్రగృహ్యయో జీవయ దూర్మిళాసఖం నమో నమస్తే మహతే హనూమతే.
త్వం రామదూతోసి దశాస్యదర్పహా త్వం వేదవేద్యోసి మహర్షి పూజితః,
త్వం రుద్రరూపోసి భవాన్ హి వైష్ణవః పురావిదస్త్వాం వివిధా గృణంతి వై.
త్వం పుత్రకామేషు సుపుత్రదాతా త్వం వీర్య కామేషు సువీర్యదాతా,
త్వం భక్తి కామేషు హి భక్తిదాతా కిం కిన్న దాతాసి నృణాం హనూమన్,
స్తుతి ప్రియస్త్వం పవనప్రియస్త్వం భక్తప్రియ స్త్వం నృహరి ప్రియస్త్వమ్.
రామ ప్రియస్త్వం సవితుః ప్రియస్త్వం ప్రసీద మహ్యాం హనుమ న్నమస్తే,
నమస్తే నమస్తేస్తు నాథాయ తుభ్యం నమస్తే నమస్తే క్ష ప్రాణాప హంత్రే,
నమస్తే నమస్తే అసుర గర్భ హంత్రే నమస్తే సమస్తాభితోష ప్రదాత్రే.

ఇట్లు స్తోత్రము చేయబడిన మహాయోగియైన హనుమంతుడు సంతసించి "వామదేవా! నీ అభీష్టమును తెలుపుము. శ్రీ నృసింహుడు రక్షకుడై యుండ చింతింప పనిలేదు." అనెను. అప్పుడు వామదేవుడు "మారుతాత్మజా! మహా తపుడను నా తండ్రి దయతో నాకు వేదముల నేర్పెను. నేను బాల్యచాపల్యముతో వారిని 'నీకు గురుదక్షిణ ఏమి ఇవ్వవలెనని' అడిగితిని. వారు 'అవసరము లేదని పలుమార్లు చెప్పిరి. కాని నేను చాలరోజుల పాటు అడుగుచునే యుంటిని. నిర్బంధముగా నేనడిగినప్పుడు మా తండ్రి శ్రేష్ఠమైన శ్రాద్ధకర్మకై అమృతమును తెమ్మని కోరెను. నేను నా సోదరులతో కలిసి అగస్త్యాశ్రమునకు వెళ్ళి అమృతమెట్లు లభించునని అగస్త్యుని అడిగితిని. ఆ మహర్షి 'హనుమంతుని స్మరించిన నీ కోరిక నెరవేరగలదు. కోరిన దానికంటె ఎక్కువగా ఇవ్వగలడ'ని చెప్పెను. స్వామీ! నా అదృష్ట విశేషమున మీ దర్శన భాగ్యము కలిగినది" అని ప్రార్థించెను.

ఆంజనేయు డిట్లనెను. "చంద్రమండలమున నేను ఉంచిన అమృతమును నీకు ఇచ్చెదను." వెంటనే చంద్రుడచ్చట ప్రత్యక్షమయ్యెను. హనుమంతుడు "చంద్రా! పూర్వము నీయందుంచిన అమృతమును వామదేవునకిమ్ము. ఇతడు యోగ్యుడు. బాల్యమునుండి హరిభక్తుడు. జితేంద్రియుడు. నాకు ప్రీతిపాత్రుడు. నన్ను తండ్రిని, గురువునను సంతసింప జేసిన ఇతనిపై నృసింహు డనుగ్రహము చూపెను." అని పలికెను. చంద్రుడిట్లనెను. "లోకమున అమృతము చాల దుర్లభమైనది. దేవతలు, నృసింహానుగ్రహము కలవారు తప్ప ఇతరులు పొందరానిది. నీయనుగ్రహమున పొందెను. ఈతడు నిన్ను గూర్చి చేసిన స్తోత్రము చదివినవారు, విన్నవారు నీ అనుగ్రహముతో విష్ణుభక్తిని పొందెదరు. శ్రీ నృసింహుని యందు భక్తి కలిగియుండి పుట్టుట దుర్లభము. నీ అనుగ్రహముచే మానవుడు కాని దేవతకాని నృసింహభక్తిని పొందగలరు. జీవన్ముక్తులు కాగలరు" అని చెప్పి అమృతమును వామదేవున కిచ్చెను. హనుమంతుడు నీకు మేలగుగాక అని అంతర్ధానమందెను.

వామదేవుడు అమృతమును తీసికొని శ్రీ నృసింహుడే తనకు ప్రత్యక్షమైనట్లు తలచెను. కోరిన దానికంటె అధికముగా హనుమంతు డిచ్చునని అగస్త్యుడన్న మాట సత్యమైనదని భావించెను. తమ్ములతో కలసి శ్రీ నృసింహుని, హనుమంతుని తలచుచు తండ్రి ఆశ్రమమునకు పోయెను. వినయముతో గురువైన తండ్రికి నమస్కరించి అమృతము నిచ్చెను. మహాతపుడు అమృతమును తెచ్చిన కుమారుని కౌగలించి తలపై ముద్దుపెట్టి ఆనందించెను. హనుమంతుడు ప్రీతుడైన విధమును జరిగిన కథను వామదేవుడు తండ్రికి తెలిపెను. పై కథను సూర్యుడు విశ్వామిత్రునకు తెలిపి ఇట్లనెను. "ఓ రాజర్షీ! హనుమద్భక్తితో వామదేవుడు నృసింహుని అనుగ్రహమునకు పాత్రుడై ముక్తినొందెను. పెక్కుమాటలేల? ఈ ఘటికాచలమున నివసించువాడు విష్ణుభక్తిని జీవన్ముక్తిని పొందగలడు."

# పదిహేడవ అధ్యాయము

వశిష్ఠు డిట్లనెను. విశ్వామిత్రుడు సూర్యునిచే బోధింపబడినవాడై ఇట్లు స్తోత్రము చేసెను.

**సహస్ర శీర్షాయ సహస్ర బాహవే సహస్ర పాదాయ సహస్ర రోచిషే,**
**మహానుభావాయ మహాస్త్రచారిణే నమః పరస్మై పతయే మహాత్మనామ్.**
**అగాధ సత్త్వాయ తమోపహారిణే మహాత్మనే సత్య మహావియ త్స్పృశే,**
**అనామయా యామితి ధీమయాయతే నమోనమః కారణ కారణాయ.**
**అజాయ లోకత్రయ పావనాయ భృతాత్మనే శిక్షిత సంహతాయ,**
**సూర్యాయ సర్గ ప్రళయాలయాయ నమో మహాకారుణికోత్తమాయ.**
**నమః ప్రశాస్త్రే జగతాం త్రయాణాం నమః ప్రశాస్త్రే జహి విద్విషే మే,**
**తమో నిహంత్రే హృదయంగమాయ నమః ప్రవక్త్రే నిగమాది వాచమ్.**
**వివస్వతే జ్ఞాని హృదంతరాత్మనే జగత్ప్రతీతాయ జగద్ధితైషిణే,**
**స్వయంభువే దీప్త సహస్రచక్షుషేసుతోత్తమా యామిత తేజసే నమః.**
**నమస్సవిత్రే జగదేక చక్షుషే జగత్ప్రసూతి స్థితి నాశ హేతవే,**
**త్రయీమయాయ త్రిసుమూర్తిధారిణే విరించి నారాయణ శంకరాత్మనే.**
**జ్యోతి ర్గణానాం పతయే నమస్తే దినాధి నాథాయ దివాకరాయ,**
**నమః ప్రభాణా మధిపాయ శాశ్వతే నమః పరస్మై మహతే బలాయ.**
**హిరణ్యరూపాయ హిరణ్మయాయ హిరణ్య కేశాయ హిరణ్య బాహవే,**
**హిరణ్యధూమ్నేచ హిరణ్య యోనయే హిరణ్యనాభాయ నమో హిరణ్వతే.**
**విశ్వాత్మనే పూర్వ మహేంద్రరూపిణే నమః పరాయావనిభృద్విహారిణే,**
**ఛాయా ప్రమాది ప్రమదా కుటుంబినే నమో నమస్తే త్రిజగ త్కుటుంబినే.**
**త్వం మంత్రరూపీ ప్రతిభాన వాన సి త్వం సత్ప్రణేతా భగవానసి ప్రభుః,**
**త్వం తత్ఫలానా మశనాయ కల్పిత స్త్వం హవ్యకవ్య ప్రణవ స్త్వ మీశ్వరః.**
**యోసౌ తప న్నుదయమేతి నభోంతరాళే వహ్నిభ్యయేవ కిరణాన్ ప్రతిగృహ్య శాంతాన్,**
**భూయోపి తత్ర విసృజస్యధికం త్వమేవ సాయంతనేషు సమయేషు తథా గృణంతి.**

ఇట్లు స్తోత్రము చేయగా సంతసించిన సూర్యుడు విశ్వామిత్రునితో ఇట్లనెను. "ఓ రాజర్షీ! నీ స్తోత్రముతో సంతసించితిని. నీకు కావలసినది కోరుకొనుము, ఇచ్చెదను."

అనగా విశ్వామిత్రుడు "భగవంతుడా! నీ దయతో నా కంతయు మేలు జరిగినది. అటులనే దయతో బ్రాహ్మణ్యము నొసంగిన ధన్యుడ నయ్యెదను. శ్రీ నృసింహుని యందు నా కచంచల భక్తి కలుగుగాక. దుర్లభమైన ముక్తిప్రదమైన విష్ణుభక్తి కలుగు గాక. నీవు ప్రసన్నుడవైనచో ఈ వరమనుగ్రహింపుము." అని ప్రార్థించెను. అప్పుడు సూర్యుడిట్లనెను. "ఈ ఘటికాచలము అనేక శిఖరములతో ప్రకాశించుచున్నది. వీనిలో 14 శిఖరములు గొప్పవి. శైలమునకు ఉత్తర శిఖరమున బ్రహ్మతీర్థమున వశిష్ఠుడు వేదముల బోధించుచున్నాడు. దానికి సమీపమున ఋషి సేవితమైన ఆశ్రమము నీ పేరున ఉండగలదు. అచ్చటనే నిర్మలోదకము గల నీ సరస్సు ఉండగలదు. దానికి ఉత్తర దిక్కున మహాసరస్సు కలదు. అచ్చటనే నరహరి లక్ష్మిని వివాహమాడెను. ఇచ్చట అనేక ఫలవృక్షములు కలవు. మృగములు పక్షులు ఆనందముగా నివసించుచున్నవి." అదివిని విశ్వామిత్రుడిట్లు ప్రశ్నించెను. "సూర్యదేవా! పాలసముద్రమున పుట్టిన లక్ష్మి ఈ సరస్సున ఎట్లు పుట్టెను? విష్ణువు ఆమె నెట్లు వివాహమాడెను." అని ప్రశ్నించెను. సూర్యుడిట్లనెను." పూర్వము మహామాయ అయిన లక్ష్మి తాను మరల ఉద్భవింపదలచి ఇచ్చట ఆ జగన్మాత పుట్టెను. ఆమె కన్యారూపమును ధరించి నృసింహపురమున అవతరించి ఈ సరస్సున సఖీజనముతో ఆవిర్భవించెను. నృసింహపురికి నైఋతి భాగమున, ఘటికాద్రికి ఉత్తరమున, బ్రహ్మ సరస్సునకు సమీపమున, తనపేరిట ఒక సరస్సు కల్పించి, అచ్చట బంగారు ఊయల నెక్కి, అప్సరోగణములు గంధర్వులు ముముక్షు జనము సేవింపగా, ఆనందముతో క్రీడించుచుండెను. ఇరువైపుల ఏనుగులు అమృత జలమును వర్షించుచుండగా జనుల ననుగ్రహించుచుండెను. ఇంతలో విష్ణువు మన్మథబాధకు తాళలేక దేవతలు ప్రార్థింపగా లక్ష్మిని వివాహమాడుటకు వచ్చెను. గరుడారూఢుడై లక్ష్మిని వెదకుచు జంబూద్వీపమునకు వచ్చెను. వింధ్యమందర శేషాచలాది పర్వతములందు వెదకి ఆర్యావర్తమున ఘటికాచలమున చూచెను. వేలకొలది ఋషి గణములచే సేవింపబడు ఆ పర్వతమునకు ఉత్తర దిక్కున ఉన్న ఉద్యానవనమున విహరించుచున్న లక్ష్మిని చూచి సంతసించెను. శంఖ చక్రధరుడై శ్రీహరి గరుడుని పైనుండే లక్ష్మికరగ్రహణము గావించెను. తన తొడపై కూర్చుండ బెట్టుకొని చిరునవ్వుతో దేవతలను చూచి ఇట్లనెను. "ఈ దేవి అనుగ్రహము వలన భూమిపై గాని స్వర్గమున గాని ఇష్టార్థ సంపదలు పొందగలరు. ఈమె కొరకు పూర్వము పాల సముద్రము చిలుకబడినది. ఈ సర్వోత్తమ స్త్రీ రత్నమును క్షణకాలమైనను నేను విడచియుండలేను. పూర్వము నేను, శివుడు, బ్రహ్మ లక్ష్మిపార్వతి సరస్వతులను చూచి వీరు ఎవరిని వరింతురో అని తలచితిమి. అప్పుడు లక్ష్మి నన్ను, గౌరి శివుని, సరస్వతి బ్రహ్మను వరించిరి. అప్పటినుండి ఈమె నా మనోహారిణియై యున్నది. మీ సంపత్కారిణి అయిన ఈమెను దేవేంద్రా! నీవు స్తోత్రము చేయుము." అని ఆదేశించెను. వెంటనే దేవేంద్రుడు ఆనందముతో ఇట్లు స్తోత్రము చేసెను.

త్వం శ్రీః హ్రీః ప్రియావిష్ణో త్వమీశాని మహేశ్వరీ,
సరస్వతీ త్వమేకేవ దృశ్యతే నర్తకీ వ హి.
త్వదాశ్రితానాం ప్రభవంతి సంపదః ప్రసన్నభావేన పరైర్దురా సదా,
పురాణవాచో విషయా త్వమేకికా సంగీయసే వేదవచోభి రాదరాత్.
త్వం విశ్వ గోప్త్రీ జగతాం జనిత్రీ తథా నిహంత్రీ త్రిగుణాశ్రయా త్వమ్,
విష్ణో రురస్సీమ నిషేదుషీ త్వం దదాసి పుత్రాంశ్చ తథా ఫలాని.
కల్పాదయో భూమిరుహాశ్చ చంద్రమా స్సుధా తథా కామగవీ మహాప్సరాః,
చింతామణిశ్చ మణిరేవ సముజ్జ్వల శ్రీ సర్వాణ్యమూని తవ సోదరభావ భాంజి.
విష్ణో రముష్య త్రిజగ త్ప్రణేతు ర్వక్షస్థలే కౌస్తుభ రత్న భూషయా,
సహాధివాసం బవతీ వచస్మ కరోతికాలా భువనేషు పద్మే.
అనాదిభావం గమితాపి దుగ్ధ పయోనిధౌ జన్మ తథా పయోజే,
ఇతః పరం జన్మ కుతోపి దేవి భావీతి కిం సాది గణేషు గణ్యా.
యామేతి వాగ్భవవతీ తచ చంద్రలేఖా మూలేతి శాంతిరితి పుష్టిరితిప్రమేతి,
ఇష్టి స్తథా మణిరితి ప్రమదేతి విష్ణో స్స్వాహా స్వధేతి విబుధా భవతీం భణంతి.
హ్రీం క్లీం ఇతి స్వకమలోపరి సంస్థ వర్ణాన్ వాభ్యాం పుటీకృత ముపేత్య విభాతి పద్మే,
శ్రీంశ్రీం ఇతి ప్రతి పదం జపతాం త్వదాఖ్యాం కింనామ భావిని జగత్రితయే బుధానామ్
దిగ్దంతి పుష్కర గృహీత నవోదకుంభ ధారాతి నిర్య దుదక ప్లవమాన దేహామ్,
దివ్యాంబరాభరణ మాల్య సుగంధ ధూప దేవోపహార బలిభిః కమలే భజేత్వామ్
విశ్వామయీతి వచసా మధిదేవతేతి గౌరీతి భూమిరితి దీధితి రిత్యజస్రమ్,
విద్యాకరేతి కమలేతి శచీతిచ త్వాం వ్యాకుర్వతే నిగమవాక్ప్రవరా సవిత్రి.

ఇట్లు స్తుతింపబడిన లక్ష్మీదేవి ఆ దేవేంద్రున కభీష్టవరముల నొసంగెను. అప్పుడు విష్ణువు "ఎవరు ఈ స్తోత్రముతో వినయముగా ప్రార్థింతురో వారి ఇంట మహాలక్ష్మి నివాసముండును. సందేహము లేదు. ఈ సరస్సు లక్ష్మీ సరస్సని పిలువబడును. ఇచ్చట స్నానము చేసినవారు వాంఛితములను బడయగలరు. ఈ శుక్రవారమున లక్ష్మిని నేను గ్రహించితిని గాన ఈ వారము స్నానము చేసి నియమముతో నుండవలయును. మా ఇరువురికి ఇచ్చట ఈనాడు మహోత్సవము జరుగును. దేవతలారా! వేయి మాటలేల! నేను లక్ష్మితో కలసి ఇచ్చట నృసింహ రూపమున నిత్యసన్నిహితుడుగా నుండెదను." అని తెలిపి సనకాదులచే స్తుతింపబడుచు అంతర్ధానమయ్యెను. కావున ఓ విశ్వామిత్ర! శుక్రవారమునాడు లక్ష్మి సరస్సున

స్నానము చేసినవారు అన్ని కోరికలను పొంది విష్ణు లోకమును చేరగలరు. వస్త్రము, ఫలము, తాంబూలము, బెల్లము, పాలు, పసుపు ఇచ్చుట ముత్తైదువకు శక్తి కొలది ఇవ్వవలెను. కల్పోక్త ప్రకారము లక్ష్మీ సరస్సు వద్ద మానవుడు యథాశక్తిగా ముత్తైదువను తృప్తిపరచినచో నృసింహసాయుజ్యమును పొందగలడు.

## పదునెనిమిదవ అధ్యాయము

వశిష్ఠు డిట్లనెను. సూర్యుడు ఉపదేశించిన విషయములను విశ్వామిత్రుడు శ్రద్ధగా ఆలకించి సూర్యుడంతర్ధానమైన తరువాత బ్రహ్మర్షిత్వమును పొందగోరి రాజర్షి యగు విశ్వామిత్రుడు ఘటికాచలమును చేరెను. సూర్యుని మాటలను మాటి మాటికి తలచుచు సంతోషముతో గిరిప్రదక్షిణము గావించెను. ఋషులందరికి బ్రహ్మకు భైరవునికి నమస్కరించి లక్ష్మీ సరస్సున స్నానము చేసి శుక్రవారమున సువాసినీ పూజ గావించెను. సరస్సునకు దక్షిణ దిక్కున తీవ్రమైన తపస్సు చేసెను. ఆ తపస్సు చూడ నలవికానిది. చేయ శక్యము కానిది. గ్రీష్మఋతువులో పంచాగ్ని మధ్యముననను, వర్ష శిశిర ఋతువులలో నీటిలోను దారుణమైన తపస్సు చేసెను. పండ్లు, గడ్డలు, నీరు ఆహారముగా తీసికొని తపస్సు చేసెను. అతనిపై శాఖోపశాఖలుగా వెదురు పొదలు పెరిగెను. మహేంద్రు డనేక విఘ్నములను కల్పించినను లెక్కపెట్టలేదు. 5 మంది దేవ వనితలను ఇంద్రుడు పంపగా వారిని ఫలించని పొదలుగా శపించెను. అప్పుడు నృసింహప్రేరితులైన దేవతలు నా కడకు వచ్చి ఇట్లనిరి. "మహర్షీ! నీకు శుభమగు గాక. శ్రీ నృసింహ అనుగ్రహముతో మహోన్నత స్థితిని పొందితివి. ఆ నరహరి విశ్వామిత్రుని తపస్సును చూచి సంతసించి మమ్ములను ఇచ్చటికి పంపెను. నీవు వచ్చి విశ్వామిత్రుని బ్రహ్మర్షియని సంబోధించ వలసినది. నృసింహుడు విశ్వామిత్రుని ఎడ మిక్కిలి ప్రసన్నుడయ్యెను."

అప్పుడు పరమానందముతో నేను నృహరి శాసనము ననుసరించి దేవతల వెంట పోయి అనేక తరులతా గుల్మాదులతో కూడిన విశ్వామిత్ర ఆశ్రమమును చూచితిని. అచ్చట లక్ష్మీ సరస్సు వద్ద ఆహ్నికమును ముగించి తరువాత విశ్వామిత్ర ఆశ్రమమునకు వెళ్ళితిని. అచ్చట ఒక ఆశ్చర్యమును చూచితిని. నృసింహుని వనమాల ఆకాశమునుండి ఒకని తలపై బడినది. ఆ క్షణముననే శంఖ చక్రముల ధరించి బంగారపు విమానము నెక్కినవాడై అతడు ప్రకాశించెను. అది చూచి దేవరాజైన ఇంద్రుని "ఈ వైష్ణవ రూపము ధరించిన వాడెవ్వ"డని అడిగితిని. ఇంద్రుడు ఇట్లు చెప్పెను. "పూర్వము హనుమన్నగరమున సత్యవుత్రుడను బ్రాహ్మణుడు కలడు. అతడు సత్ శీలము గుణసంపద కలిగిన వైష్ణవుడు. ఈ కొండకు ప్రదక్షిణము చేసిన తరువాతనే మిగిలిన పనులు చేసికొనెడివాడు. అతడు జ్ఞాని. జితేంద్రియుడు.

విష్ణుభక్తులను, బ్రాహ్మణులను, దేవతలను చూచినంతనే నమస్కరించి సేవించెడివాడు. అతడు ఒకప్పుడు నృహరిని సేవించుటకై ఘటికాచలము నెక్కసాగెను. నేను విసనకర్రను ధరించి అతని శ్రమను పోగొట్టుటకై విసరితిని. వైష్ణవ కైంకర్యము వలన ఉన్నతపదవిని పొందితిని.

పూర్వము కళావంతుడను వైశ్యపుత్రుడుండెను. వరదత్తుడను ముని అనుగ్రహముతో అతనికి ఇరువురు పుత్రులు పుట్టిరి. అతని పెద్ద కుమారుని పేరు పింగళకుడు. ఇతడు వరతంతు వనుమునికి నిత్యము సేవ చేసెడివాడు. విష్ణుభక్తులకు యథాశక్తిగా దానము ధర్మము చేసెడివాడు. 15 సంవత్సరములు గడచినను అతనికి సంతానము కలుగలేదు. అందువలన అతనికి చింత కలిగెను. అతని బాధను చూచి వరతంతు మహర్షి గోపాల మంత్రము నుపదేశించెను. "నాలుగు అక్షరములు గల ఈ మంత్రము నీవు ఉదయ మధ్యాహ్న సాయంకాలముల యందు గోపాలుని హృదయమున నుంచుకొని 100 మార్లు జపింపుము. అప్పుడు గోపాలుడు నీకు పుత్రుల ననుగ్రహించును. ఇచ్చటికి పశ్చిమ దిక్కున ఉన్న ఘటికాద్రికి వెళ్ళి భగవంతుడైన నృసింహుని నిశ్చలముగా ధ్యానింపుము. బ్రహ్మతీర్థము మొదలైన మహాతీర్థములలో స్నానము చేసి గిరిప్రదక్షిణము చేసి ఆ శిఖరమునందున్న ఆయాతీర్థములయందు స్నానము చేసి నీ వరములను పొందుము." అని చెప్పెను. మరియు ఇట్లనెను.

పూర్వము పుణ్యపురాధిపతి యైన శత్రుంజయుడను వాడు సంతానార్థమై గురువైన కాశ్యపుని వద్దకు వెళ్ళి ఇట్లు ప్రార్థించెను. "ఓ మహర్షీ! నాకు రక్షకుడై మీరుండగా సంతానము లేదన్న కొరత నన్ను పీడించుచున్నది. సంతానము లేనప్పుడు రాజ్యమేల? మంత్రులేల? భోగభాగ్యములేల?" అని విలపించెను. అప్పుడు కాశ్యపుడు "రాజా! నీవు విష్ణు భక్తి కలిగి యుండుము. శ్రీ నృసింహుని ప్రీత్యర్థము పుత్రకామేష్టిని చేయుము. ఆ దేవదేవుడు నీకు సంతతి ననుగ్రహించును. సందేహింప వలదు." ఈ మాటలు విన్న రాజు నృహరి సన్నిధానమున పుత్రకామేష్టిని చేసెను. భగవదనుగ్రహము వలన సంతతిని బడసెను.

కావున నీవు కూడ నీ భార్యతో కూడి శ్రీ నృసింహ సన్నిధిలో మాలికలు రచించి, దేవ బ్రాహ్మణులను సేవింపుము. నృసింహునకు తులసితో మాలలు నిర్మించుము. ఇతర దేవతలకు పువ్వులతో మాలలు కట్టుము. ఆయా తీర్థములయందు స్నానము చేసి వైష్ణవులను సేవించి దానము చేయుము. దీనిచే నీ కోరికను పొందగలవు. మాలలు కట్టుటచే వైష్ణవుడవయ్యెదవు. అచ్చట నున్న సత్యవ్రతుడను హనుమంతుడు తృప్తి చెందగలడు. హనుమత్సేవతో సర్వము సిద్ధించగలదు.

ఒకప్పుడు పింగళుడను ముని వీణ వాయించుచు నృసింహ సమీపమున సంచరించును. నృసింహుడు ప్రసన్నుడై పుష్పమాలను ఇచ్చును. ఆమాలతో వీణను

అలంకరించి అతడాకాశమున తిరుగుచుండగా ఆమాల గాలికి తొలగి నీ తలపై పడును. దానిని నీవు ధరించినంతనే బంగారు విమానములో విష్ణులోకము చేరెదవు," అని వరతంతు మహర్షి ఉపదేశింపగా పింగళుడు హనుమంతుని అనుగ్రహముతో సంతానమును పొందెను. నీవు చూచిన ఉన్నతస్థితిని పొందెను.

ఈ మాటలు విన్న వశిష్ఠుడైననేను "ఆహా! విష్ణు మాహాత్మ్యము నరహరి పాదసేవ ఎంతగొప్పవి". అని సంతసించితిని. తరువాత బ్రహ్మదేవుడు దేవతలతోను నాతోను కలసి విశ్వామిత్రుని సమీపమునకు వెళ్లెను. వశిష్ఠుని చూచి విశ్వామిత్రుడు తనకు శుభము కలుగునని భావించెను. "ఆహా! నా తపస్సు ఫలించినది. వశిష్ఠునితో ఇట్లనెను. "మహర్షీ! నా అల్పమైన ఆతిథ్యమును గ్రహింపుము. నా వద్ద కామధేనువు లేదు." వశిష్ఠుడు ఇంద్రప్రేరితుడై నృహరి ఆజ్ఞానువర్తియై "నీకు బ్రహ్మర్షి పదవి లభించినది. ఓ బ్రహ్మర్షీ! నీవు కఠోర తపస్సుతో నృసింహుని ప్రసన్నుని గావించుకొంటివి. వరాహ కల్పమున సప్తర్షులలో శ్రేష్ఠుడవై యుండెదవు. వైవస్వత మన్వంతరమున మేమందరము నీకై ఎదురుచూచెదము." అని చెప్ప బ్రహ్మర్షిత్వమును అతనికి ప్రసాదించితిని. ఆనందముతో తిరిగి వచ్చితిని. తరువాత బ్రహ్మర్షియైన విశ్వామిత్రుడు సాలోక్యముక్తికై నృసింహుని గూర్చి తపము చేయుచున్నాడు.

ఇది గాక ఓ రాజా! గౌతముని దౌహిత్రుడు ఇచ్చట ఘోరమైన తపస్సు చేసెను. విష్ణు భక్తుడై అరిషడ్వర్గముల జయించి త్రికాలముల యందు నరహరిని ధ్యానించి మితాహారియై గాయత్రిని జపించెను. ఒక నాడతడు పర్వతము నెక్కు మార్గమున ఉన్న గడ్డిని తొలగించుటకు భార్యతో కూడ శ్రమపడుచుండెను. అది చూచి మహర్షులు మెచ్చుకొనిరి. పృథులోముడు "ఓ మహాత్ములారా! మీ దయవలన నృసింహుడు ప్రసన్నుడు కాగలడు. వైదిక మంత్రము అమోఘమైనట్లే బ్రాహ్మణ ఆశీర్వాదము అమోఘమైనది. హరి భక్తికూడ అమోఘమైనదని పెద్దలు చెప్పుదురు. "అని నమస్కరించెను అప్పుడు ఋషులు "నీకు శ్రీహరి ప్రసన్నుడు కాగలడు. సాలోక్యముక్తి నొసగ గలడు" అని దీవించిరి. అంతలో నరహరి ప్రత్యక్షమై సకుటుంబముగా పృథులోముని విష్ణు లోకమునకు గొనిపోయెను.

కావున ఘటికాచలమున మార్గమును శుద్ధి చేసినవారు ఋషుల అనుగ్రహముతో కోరికలను పొందగలరు. ఈ కథను విన్నవారు మార్గమును శుభ్రపరచినవారు సకలమైన జ్ఞానమును తపః ఫలమును పొందగలరు.

## పంతొమ్మిదవ అధ్యాయము

ఇట్లు మహాత్ముడైన వశిష్ఠుడు ఘటికాచల మాహాత్మ్యమును వివరింపగా ఇంద్రద్యుమ్నుడు కలకాలము దానమగుడై సంతోషముతో నిటనెను. "మహర్షీ!

వైష్ణవ కథామృతముతో నేటికి నా శ్రవణేంద్రియములను తృప్తి పరచితిరి. మీరు శ్రీ నృసింహ భక్తులు. ఏ ఉపాయము చేత సర్వ కర్మఫలము కలుగునో అట్టి ఉపాయమును దయతో నాకు తెలుపుడు" అని అడిగెను. వశిష్ఠుడు "రాజా! పవిత్రమైన నృసింహ కవచమును చెప్పెదను. సావధానుడవై వినుము. దీనితో భావించిన మనస్సు కలవారిని చూచి అపగ్రహములన్నియు పారిపోవును. మొదట నృసింహ మంత్రమును జపించి తరువాత కవచమును పఠించిన పురుషుడు లోకమున నాలుగు పురుషార్థములను బడయ గలడు.

మంత్రస్యాస్య మహాభాగ ఋషి రాశ్లాయన స్స్మృతః ।
ఛందో నుష్టుప్ తథాదేవో భగవాన్ నృహరి ర్హరిః
సకలాభీష్ట సిధ్యర్థే వినియోగ ఉదాహృతః.
ఆదౌ ప్రణవముచ్చార్య లక్ష్మీబీజం తతః పరమ్,
నృసంహేతి పదం పశ్చా చ్చతుర్థ్యంతం సముచ్చరేత్.
నమస్కృత్యతతో ధీమాన్ మంత్ర రాజం సముచ్చరేత్,
తేనైవ హృది గుప్తేన భుక్తి ముక్తీ ప్రవిందతి.
ప్రజాపతి సహస్రంతు ప్రజపేత్ మంత్ర ముత్తమమ్,
ధ్యాయే దుక్తేన విధినా జానున్యస్త కరద్వయమ్.
యోగాసనే సమాసీనం శంఖ చక్ర మహాయుధమ్,
సురర్షిభి ర్యుతం దేవై స్సేవ్య ముత్పల కోమలమ్.
ప్రశమం నిరతారూఢం యోగోద్ధృత పయోరుహమ్,
నమద్ఘటికా శైలా ధ్యక్షం తం పురుషోత్తమమ్.
నృహరీతి కృతాభిఖ్యం సత్పరిత్రాణ సంభవమ్,
ప్రభాతే తత్సవం నిత్యం కర్తవ్యం ఫలమిచ్ఛతా.
జపాంతే కవచం తస్య నృసింహస్య మహా మనోః,
పఠేత్త్రిసంధ్యం నియతో నృహరి ప్రీతయే నృప.
ఓం నృసింహోగ్రతఃపాతు శ్రీనృసింహస్తు పృష్ఠతః ,
అచ్యుతో వామతః పాతు పాతు దక్షిణతో హరిః.
హిరణ్యాదారకో వక్త్రం కంఠం రౌద్రాకృతిః పుమాన్,
ప్రహ్లాదాహ్లాదకారీ మే బాహూ రక్షతు సర్వదా.

హృదయం కేసరీ రక్షేత్ దంష్ట్రావా న్మమచోదరమ్,
కటిం కరాళ వదనో జఘనం జగదీశ్వరః.
వృషణం వృషపర్వా మే పాతు మేఢ్రం మహోభుజః,
అష్టాదశ భుజో రక్షేత్ ఊరూమే జానునీ విభుః.
జంఘే మే పాతు దైత్యేంద్ర వసామాలా విభూషణః,
ఘటికాచలవాసో మే సదా రక్షతు గుల్ఫయోః.
పాదౌ స్తంభోద్భవః పాతు పదపృష్ఠే మహీధరః,
పాదాంగుళిస్తు మే రక్షేత్ కోలాహలకరః పుమాన్.
రోమకూపాణి సింహేంద్ర స్త్వచంమే యోగశీలవాన్,
రక్త మజ్జ వసా మాంసా నస్థీన్ మే భైరవ స్వనః.
అంగాని దీర్ఘ శ్రవణః మకుటం మే కిరీటవాన్,
జ్వాలాముఖ స్తదా జ్వాలా స్సర్వాత్మాపాద సంధిషు.
శంఖ చక్రధరః శుక్లం ఛాయాం ఛాయాపతిః ప్రభుః,
అహంకారా ద్యనేకాని హుంకార ధ్యాన భీషణః.
ప్రాణాపానౌ తథా వ్యాన ముదానం చ సమానకమ్,
యశః కీర్తించ లక్ష్మీంచ రక్షే ద్భక్తోచితో హరిః.
హేమకోటి విమాన స్థో గోత్రం మే పాతు శాశ్వతమ్,
భార్యాంమే రక్షతు సదా వామదేవాది ముక్తిదః.
సప్తర్షివంద్యః పుత్రాన్ మే పశూన్ మే హనుమత్ప్రియః,
మార్గం రుద్రప్రియో రక్షేత్ సర్వతః స్తుతిమేయివాన్.
ఇదం హికవచం పుణ్యం సురాణామపి దుర్లభం,
యః పఠేత్ ప్రయతాత్మావై త్రిసంధ్యం నృహరేః పురః.
నిశ్చలా వైష్ణవీ భక్తి స్తస్మిన్న వ్యభిచారిణీ,
అపగ్రహాః ప్రధావంతి కవచే హృది సంస్థితే.
డాకిన్యాద్యాః పిశాచాశ్చ శాకిన్యాద్యా స్తథా రిపుః,
నశ్యంతి వ్యాధయ స్సర్వే భూతాది స్ఫోటకాదయః.
అభిచారిణి సర్వాణి మంత్ర యంత్రాణి వై తథా,
కవచే నామునా యస్తు సంపరిష్కురుతే మనః.

సిద్ధ్యంత్యు చ్చాటనాదీని తస్య విష్ణోః ప్రసాదతః,
మనోన్మథీ ర్భవే ద్రాజన్ ప్రభవే ద్బ్రహ్మ వర్చసమ్.
యః స్త్రి సంధ్యం పఠే న్నిత్యం శ్రద్ధయా హరిసన్నిధౌ,
యం యం చింతయతే కామం తం త మాప్నోత్యయత్నతః.
పురా విష్ణూపదిష్టేన కవచేనా మునా నృప,
బ్రాహ్మణ్యం గాధితనయః ప్రవిందత మునీశ్వరః.

పూర్వము విష్ణువుచే ఉపదేశింప బడిన కవచమును జపించి విశ్వామిత్రుడు బ్రాహ్మణ్యమును పొందెను." అని చెప్పెను. ఈ విషయమును చెప్పి బ్రహ్మ ఇట్లనెను. వశిష్ఠునిచే ఉపదేశింప బడిన ఇంద్రద్యుమ్నుడు ఆచమనముచే శుచియై పుష్కరిణీ తీరమున ఈ ఉపదేశమును పొందెను. తరువాత గురువును పూజించి స్థిరచిత్తముతో పద్మాసనా సీనుడై మంత్రమును కవచమును జపించి అందరికంటె గొప్పవాడయ్యెను. తరువాత వజ్రసమానమైన కవచమును ధరించి ధనుర్ధరుడై అచ్చట ఉన్న తీర్థములలో స్నానము చేసి శైలము నెక్కి ఇట్లు ప్రశ్నించెను. "సర్వదేవ ఋషి వందితమైన శిఖరమేది? ఇచ్చట ఉన్న ఆశ్రమమెవరిది?"

వశిష్ఠ డిట్లనెను. "రాజర్షీ! వామదేవాది ఋషులు ఇచ్చట తపస్సు చేయుచున్నారు. శిలారూపముతో నృసింహుడు ఇచ్చట తన పేరుతో సరస్సును నిర్మించెను. పూర్వము ఋషులకు ముక్తి నొసగుటకై భగవంతు డిచ్చట ఆవిర్భవించెను. ఈ నృసింహ తీర్థము సకల పాపములను తొలగించును. పూర్వము ఈశ్వరుడు పార్వతిచే ప్రేరితుడై ఇచటికి వచ్చి స్నానము చేసి బ్రహ్మ హత్యా పాతకమును తొలగించుకొని కైలాసమునకు వెళ్ళెను. ఈ ఆశ్రమము వామదేవునిది. శ్రీ నృసింహ తీర్థము వద్ద ఉన్నది. ఇచట ఇంద్రాది దేవతలు ఋషులు నృసింహ ప్రీతికై ఎల్లప్పుడు తర్పణము చేయుదురు. నాలుగు వర్ణముల వారు ఇచ్చట స్నానము చేసి దేవతలకు ఋషులకు తర్పణము చేయుదురు. ఇచ్చట అనేక వృక్షరాజములు కలవు. సంతానాది దేవతా వృక్షముల మధ్య కల్పవృక్షము క్రింద లక్ష్మీ సహితుడై శంఖ చక్ర వర అభయ ముద్రలు ధరించి నృసింహుడు ప్రకాశించుచున్నాడు. పూర్వము గయాది క్షేత్రముల నొక వైపున ఈ క్షేత్రము నొకవైపున తూచినప్పుడు గయాదులు పైకి లేచినవి. అది చూచి బ్రహ్మాది దేవతలు ఋషులు నృసింహ క్షేత్రమే శ్రేష్ఠమని తలచిరి.

పూర్వము దత్తుడను బ్రాహ్మణుడు చిన్నతనమునుండి ధర్మపరాయణుడై యాదవాద్రిలో కల్యాణసర స్తీరమున తపస్సు చేసెను. ఒక యవనుడు తన తండ్రిని చంపిన విషయమును విని దుఃఖించుచుండెను. అప్పుడు పురుకుత్సుడను ఋషి ఇట్లు ప్రశ్నించెను. "అయ్యా! నీ వెందుల కిట్లు దుఃఖించుచున్నావు. ఏదైన జరుగరానిది

జరిగినదా?" దత్తుడిట్లు తెలిపెను. "శతధర్ముడను వత్సవంశజాతుడైన నా తండ్రి నేను పుట్టిన తరువాత యవనుల పురమునకు వెళ్ళెను. అచ్చటనే అతడు వారి అలవాట్లను నేర్చుకొనెను. నాకు గాని మా తల్లికి గాని బంధువులకు గాని కనిపించలేదు. అట్లైనను మేము వైదిక ధర్మము ననుసరించి, తండ్రి ఎట్టివాడైనను సేవింపదగిన వాడే అను మార్గము ననుసరించి, మనసులో సేవించుచుంటిని. అట్టి నా తండ్రి ఈనాడు మరణించెను. ఏమి చేయవలెనని చింతించుచుంటిని." అప్పుడు పురుకుత్సుడు "నాయనా! మీ తండ్రి ఎముకలను తీసికొని గయకు వెళ్ళుము. అక్కడ శ్రాద్ధాది కర్మలు చేయుము. గదాధరుడు ప్రీతి చెందినచో నీ తండ్రి సమస్త పాపములనుండి విడువబడును" అనెను. ఈ మాటలు విన్న విష్ణు దత్తుడు సకుటుంబముగా గయకు వెళ్ళదలచెను. ఇంతలో అశరీరవాణి ఇట్లు పలికెను. "విష్ణుదత్తా! నీ తండ్రిని ఘోర నరకముల నుండి తప్పించవలె నన్నచో ఘటికాచలమునకు వెళ్ళుము. అచ్చట ఉన్న నృసింహ సరస్సున స్నానము చేసి అక్కడ ఇంగుదీ వనములో స్వయముగా ఆవిర్భవించిన నృసింహుని సేవింపుము. పూర్వము వామదేవుడు, నృసింహుని ఇంగుదీ వనములో సేవించినవారు, పితృ కర్మలు చేసినవారు, గయాక్షేత్రములో చేసిన కర్మఫలము కంటె అధిక ఫలమును పొందవలెనని, నృసింహుని ప్రార్థించి యుండెను. కావున నృసింహానుగ్రహముతో ఈ క్షేత్రమున పితృకార్యములు చేసినవారు ద్విగుణ ఫలమును పొందగలరు. నృసింహుని అంగుష్ఠము నుండి పుట్టిన ఈ సరోవర జలము గంగతో సమానమైనది. ఇచ్చట చేయుదానాదులు రెండింతలు ఫలము నియ్యగలవు."

అశరీర వాణి మాటలు విన్న విష్ణుదత్తుడు సంతోషముతో ఇచ్చట స్నానము చేసి పితృకర్మల నాచరించి నృసింహుని సేవించెను. వెంటనే అతని పితృదేవతలు ప్రత్యక్షమై "నాయనా! నీ శ్రాద్ధముతో మేము తృప్తులమైతిమి. నీకేమి కావలయునో తెలుపుము" అనిరి. విష్ణుదత్తుడు "మీరు తృప్తులైనచో నా తండ్రిని నరకమునుండి ఉద్ధరించుడు" అనెను. పితృదేవతలు ఇట్లనిరి. "నీవెప్పుడు పితృకార్యార్థమై ఈ క్షేత్రమునకు వచ్చితివో అపుడే నీ తండ్రి తరించెను. నీవు దీర్ఘాయుష్మంతుడవై పుత్రవంతుడవై సుఖింపగలవు. నీకు విష్ణుభక్తి నిశ్చలమై యుండుగాక." అని ఆశీర్వదించి అంతర్ధానము చెందిరి. విష్ణుదత్తుడు సంతోషముతో పితృ ప్రసాదమును స్వీకరించెను. అందువలన అతడు ఇరువురు కుమారులను పొందెను. సకల భోగ భాగ్యముల ననుభవించి నృసింహ సాయుజ్యమును పొందెను. ఆ విష్ణుదత్తుని వంశమున పుట్టిన విప్రశేఖరుడను వాడు ఇప్పుడు వరాహ తీర్థము వద్ద నృసింహ అనుగ్రహమును కోరి తపస్సు చేయుచున్నాడు. ఇతని పూర్వీకులు పుంజికాదులు మూర్ఖులై యుండిరి. వారు కర్మబాహ్యులై గురుదూషకులై దేవతా నిందకులై సజ్జన పీడకులై, నిత్యనైమిత్తిక కర్మభ్రష్టులై, పరస్త్రీ వ్యామోహపరులై యుండిరి. వారిని చూచి ఋషులు కోపముతో వెడలగొట్టిరి. వెలివేయబడుటచే మిక్కిలి బాధలతో మరణించి పిశాచములైరి. వారి శరీరములను

జంతు కీటకములు స్పృశించలేదు. దుర్గంధ భూయిష్ఠములైన వారి శరీరముల జూచి కొందరు మహర్షులు భస్మమై పోవుగాక అని శపించిరి. వారి కుమారుడు వారి నుద్ధరించుటకై, విష్ణులోకములను చేర్చుటకై, యెంతయో ప్రయాస పడెను. కాని అశక్తుడాయెను. అతని మొదటి కుమారుడైన విప్రశేఖరుడనువాడు అగస్త్య భ్రాత ఉపదేశము ననుసరించి ఈ వరాహ సరస్సు తీరమున పితరులను తరింప చేయుటకై దారుణమైన తపస్సు చేయుచున్నాడు. పర్వతారోహణ మార్గమును శుద్ధి చేయుచున్నాడు. దాన ధర్మములను చేయుచున్నాడు. త్రికాలములయందు నృసింహ ధ్యానము చేయుచున్నాడు.

పూర్వము ప్రహ్లాదుని అతని తండ్రి హింసింప బూని నడి సముద్రమున ముంచెను. నృసింహుడతనికి ఈ స్తోత్రము నుపదేశించెను. దీనిని జపించి ప్రహ్లాదుడు సముద్రమునుండి బయటపడి తండ్రి వద్దకు చేరెను. ఆ స్తోత్రమును నీకు ఉపదేశించెదను.

హేమకోటి విమానస్థం జాను న్యస్త ప్రకోష్ఠకమ్,
శంఖచక్రధరం పీతవాసోద్భాసి కటీతటమ్.
యోగాసనే సమాసీనం కిరీటిన మనామయమ్,
దూర్వా నీలోత్పల వన శ్యామలం కోమలాకృతిమ్.
ప్రసన్న వదనం లక్ష్మీ భాసితోరస్క ముజ్జ్వలమ్,
నతమర్త్య పసన్నార్తి హారిణం వనమాలినమ్.
శ్రీవత్స కౌస్తుభ ధరం చంద్రసూర్య విలోచనమ్,
సింహ స్కంధం సింహముఖం ప్రహ్లాద ప్రియకారిణమ్.
దానవేంద్ర విభేత్తారం కర్తారం జగతామపి,
గోప్తాంచ తథా విష్ణు ప్రణతార మనిందితమ్.
దంష్ట్రిణం తం కేసరిణం నరకేసరిణం విభుమ్,
సప్తర్షి వందితం భీమం గదాధర మధీశ్వరమ్.
వ్యక్తాననం మహోరస్కం జ్వాలా మాలా విభూషణమ్,
షట్కోణమధ్య నిలయం ఉన్నత శ్రుతి ముద్ధరమ్.
ఉదగ్రనాస ముచ్చండ కాల ముత్తమ మస్తకమ్,
వామదేవాది బ్రహ్మర్షి సేవితం శివసేవితమ్.
సర్వకామప్రదం వ్యక్త మవ్యక్తం పురుషోత్తమమ్,
సింహ గామిన మీశానం నిధి మచ్యుత మవ్యయమ్.

పింగళాక్షం పృథుగ్రీవం విమలం స్తంభ సంభవమ్,
ముక్తిదం భుక్తిదం శాంతం దాంత మానంద కందళమ్.
మందార మాలాభరణం అష్ట బాహుం మహోదరమ్,
సనకాది నుతం దేవం రాజపూజిత మీశ్వరమ్.
సూర్యకోటి ప్రతీకాశం చంద్రకోటి సమ ద్యుతిమ్,
శృంగకోటి మహాశైల వాసినం హృది వాసినమ్.
హనుమద్వందితం లోక శంకరం శంకరప్రియమ్,
భక్తార్చితం యథా భక్తి దాయినం శుభదాయినమ్.
సటాలంకృత మవ్యగ్రం ఉగ్రశాసన ముద్ధతం,
విస్తీర్ణ వదనం దీన రక్షకం సుర రక్షకమ్.
జపాకుసుమ వర్ణాభం హేమ యజ్ఞోప వీతినమ్,
ధృత హేమ కటీసూత్రం హేమాంగం హేమకుండలమ్.
హేమపుష్ప మహామాలా పరిష్కృత భుజాంతరమ్,
దైత్యరాజ వసా మాలా భరణం శరణం నృణామ్.
ఉత్తమా నుత్తమం దేవ రాజ మాజాను బాహుకమ్,
పోషణం జగతాం భూత భావనం పత్రివాహనమ్.
వేదాంత వేద్య మవ్యగ్రం వైఘానస సుపూజితమ్,
వాలఖిల్యాది యోగీంద్ర సంస్తుతం పరమార్థదమ్.
మహోక్షంచ హిరణ్యాక్ష శిక్షకం భక్త రక్షకమ్,
అపరాజిత మక్షోభ్య మనంతం పరమం పరమ్.
అనేకరూప మాదిత్య మండలస్థ మకృత్రిమమ్,
హిరణ్మయం హిరణ్యాక్షం హిరణ్య శ్మశ్రుకం ప్రభుమ్.
నాయకం సురమాలాయా ఘటికాచల నాయకమ్,
నమస్కుర్వన్ సదా విప్ర శేఖరో విష్ణుభక్తిమాన్.
ఏకవింశోత్తర శతం నామ్నాం నరహరే రిదమ్,
చతుర్థ్యంతేన సహితం సమర్చయతి భూపతే.

# ఇరువదియవ అధ్యాయము

వశిష్ఠ డిట్లనెను. "ఇది పరమ పవిత్రమైన స్తోత్రము. పాపహరము. వేదసమ్మతము. దీనిని చదివినవారు ధన్యులు. అత్యంత పాపపీడితులైనవారు దీనిని చదివినచో ఉద్ధరింపబడుదురు. దేవరాజైన ఇంద్రుడు అహల్యా సంగమమువలన శాపముతో వృషణములు లేనివాడయ్యెను. అందువలన సిగ్గుతో తలవంచుకొని దేవతా సమూహమును చేరలేక పోయెను. మానస సరోవరములోని తామరపువ్వుకాడలో దూరెను. అచ్చట తన అవయవములన్నియు తామరాకులతో పూరేకులతో కప్పబడెను. హంసలు తామరతూడుల తినుటకై వచ్చి ఇతనిని చూచి ఇంద్రుని పరాభవమును గూర్చి బ్రహ్మతో చెప్పినవి. బ్రహ్మ ఆ సరస్సుతీరమున ప్రత్యక్షమై ఇంద్రుని వెదకుచు ఒకానొక తామరపూవుయొక్క మధ్యలో దాగిన ఇంద్రుని చూచెను. అతనితో ఇట్లనెను. "ఇంద్రా! వ్యర్థముగా ఈ నీటిలో దాగియున్నావు. నృసింహ అష్టోత్తర శతనామమును జపించుము." ఇంద్రుడు ఆ అష్టోత్తరమును జపించి మరల వృషణములు పొంది, దేవలోకమునకు వెళ్ళెను. ఇంద్రద్యుమ్నుడు వశిష్ఠుని ద్వారా ఈ స్తోత్రమును పొంది పాపవిముక్తుడయ్యెను.

ఇంద్రద్యుమ్నుడు వశిష్ఠునితో నిట్లనెను. "స్వామీ! ఈ హేమకోటి శిఖరము నా మనస్సునకు మిక్కిలి శాంతి కలిగించుచున్నది." అప్పుడు వశిష్ఠ డిట్లనెను. "రాజా! పూర్వము చాలకాలము తపస్సు చేసిన ధ్రువుడు ప్రహ్లాదుడు ఈ క్షేత్రము దర్శించిరి. ఇచ్చట నివసించిన ప్రహ్లాదుడు నరహరి ధ్యానముతో సంపూర్ణ శాంతిని పొందెను. ఈ శిఖరమునకు దక్షిణమున చక్రతీర్థమున్నది. పశ్చిమమున శంఖమను పేరుగల మహాతీర్థమున్నది. ఘటికాశైలమునకు ఇవి రెండు కండ్లవంటివి. ఈ శంఖచక్రతీర్థములు ఋషిసేవితములు. పూర్వమిచ్చట మహాలక్ష్మిని హరి శంకరులుపాసించిరి. చంద్రసూర్య బ్రహ్మలు కూడ లక్ష్మిని సేవించి వరములను పొందిరి. హరికి జ్ఞాన ప్రదాతృత్వము, శంకరునికి శ్రీ ప్రదాతృత్వము, చంద్రునికి కళాప్రదాతృత్వము, సూర్యునికి ఆరోగ్య దాతృత్వము, బ్రహ్మకు ప్రజాపతిత్వము కలిగినవి. కుబేరుడు నారదుని ద్వారా ఈ మాహాత్మ్యమును విని, తానును సేవించి ధనాధిపత్యమును పొందెను. కుబేరు డిచ్చట ఫలమూలములను తినుచు చాలకాలము తపస్సు చేసెను. నృసింహ భక్తులను సేవించెను. ఋషుల ప్రీత్యర్థము తీగలను పెంచెను. లక్ష్మీ సూక్తము జపించెను. అప్పుడు మహాలక్ష్మి ఆ తీగల మూలములో ఆవిర్భవించెను. కుబేరుడిట్లు ప్రార్థించెను.

**అంబ త్వత్సన్నిధానేన కృతార్థోహం తథా పరః,**
**చరితార్థంచ విజ్ఞానం తథా సందర్శనం సతా.**

అద్యతే పాదపద్మస్య దర్శనా జ్జగదీశ్వరి,
చరితార్థ మివాత్మానం మన్యే కన్యేపయోనిధేః,
శ్రీ లక్ష్మీ రిందిరా పద్మా లోకమాతా జనేశ్వరీ,
పద్మాలయా పద్మహస్తా నిత్యా పద్మప్రియా సతీ.
యోగినీ సా యోగనిద్రా కమలా మాలికా రమా,
హరిప్రియా సింధుకన్యా పద్మజన్మాథ భార్గవీ.
సర్వకామప్రదా నృణాం మంగళా చేందిరా స్వధా,
స్వాహా పుష్టి స్తథా తుష్టి స్సర్వకామ దుఘా ప్రియా.
సతై ర్నామపదై రంబా నిత్యం సంపూజ్యతాం నృభిః,
కింకింన ప్రార్థితా కుర్యాద్భవతీ హరి వల్లభే.

అప్పుడు లక్ష్మి "కుబేరా నీకు శుభమగు గాక, నీకు కావలసిన వరములు కోరుకొనుము." అనెను. కుబేరుడు ధనాధిపత్యమును కోరెను. అప్పుడు లక్ష్మి తనచేతితో పెద్దరాయిని తొలగించెను. అచ్చట శంఖము, పద్మము మొదలైన నవనిధుల మీద నీరు ప్రోక్షించెను. నీకు కావలసినవి తీసికొను మని చెప్పెను. కుబేరుడు లక్ష్మికి నమస్కరించి నవనిధులకు అధిపతి అయ్యెను. అచ్చట ఋషులు తీగల మూలములో పుట్టిన లక్ష్మిని స్తోత్రము చేసిరి. ఆమెను అమృత వల్లీశ్వరి అని పిలిచిరి. అందువలన లక్ష్మి అమృతవల్లీశ్వరి అయినది. అది మొదలు లక్ష్మి ఎల్లప్పుడు శంఖపుష్కరిణి యందు ఉండును. ఎవరు ఇచ్చట లక్ష్మిని సేవించెదరో వారికి కోర్కెలన్నియు నెరవేరును. ఈ తీర్థమునకు ఆగ్నేయ భాగమున రెండు శిఖరముల మధ్య చక్రతీర్థము కలదు. ఇక్కడ ఋషులు తపస్సు చేయుచుందురు. పూర్వము ఔద్దాలకుడను ఋషి పశుసంపదకై నరహరి సన్నిధిలో తపస్సుచేసెను. హనుమంతుని, నృసింహుని మెప్పించి చక్రధారియైన హనుమంతుని చూచి ఇట్లు స్తోత్రము చేసెను.

మారుత స్యౌరసఃపుత్ర ప్రసీద త్వ మరిందమ,
నవైత్వద్వ్యతిరిక్తోస్తి స్తోత్రాన్నృహరి మీశ్వరమ్.
అతి పాటల వక్త్రాబ్జం ధృత హేమాద్రి విగ్రహమ్,
ఆంజనేయం శంఖచక్ర పాణిం చేతసి ధీమహి.
పారిజాత ప్రియో యోగీ హనుమా న్నృహరిప్రియః,
ప్లవగేంద్రః పింగళాక్ష శ్శీఘ్రగామీ దృఢవ్రతః.

శంఖ చక్రవరా భీతి పాణి రానందదాయకః,
స్థాయీ విక్రమ సంపన్నో రామదూతో మహాయశాః.
సౌమిత్రి జీవనకరో లంకా విక్షోభకారకః,
ఉదధిక్రమణ స్సీతా శోక నాశకరో హరిః.
బలీ రాక్షస సంహర్తా దశకంఠ మదాపహో,
బుద్ధిమాన్నై బుత వధూ కంఠసూత్రవిదారకః.
సుగ్రీవ సచివో భీమో భీమసేన సహోదరః,
సావిత్రి విద్యా సంసేవీ చరితార్థో మహోదరః.
వాసవాభీష్టదో భవ్యో హేమశైల నివాసవాన్,
కింశుకాభో వ్యగ్రతనూ బుజురోమా మహామతిః.
మహాక్రమో వనచర స్థిరబుద్ధి రభీశుమాన్,
సింహికా గర్భ నిర్భేత్తా భేత్తా లంకా నివాసినామ్.
అక్షఘ్న శ్శత్రు నిఘ్నశ్చ రక్షోమాత్య భయావహః,
వీరహా మృదు హస్తశ్చ పద్మపాణి ర్జటాధరః.
సర్వప్రియ స్సర్వకామప్రదః ప్రాంశుముఖ శ్శుచిః,
విశుద్ధాత్మా విజ్వరశ్చ సటావాన్ పాటలాధరః.
భరత ప్రేమ జనకో చీరవాసా మహాక్షదృక్,
మహాస్త్ర బంధనసహో బ్రహ్మచారీ వ్రతేశ్వరః.
మహౌషధ్యప హర్తాచ వృక్షపర్వా వృషోదరః,
సూర్యోప లాలిత స్స్వామీ పారిజాతావతంసకః.
సర్వప్రాణధరో నంత స్సర్వ భూతాతిగో మనుః,
రౌద్రాకృతి ర్భీమకర్మా భీమాక్షో భీమదర్శనః.
సుదర్శన కరో వ్యక్తో వ్యాత్తాస్యో దుందుభిస్వనః,
సువేలచారీ మైనాక హర్షదో హర్షణప్రియః.
సులభ స్సువ్రతో యోగీ యోగిసేవ్యో భయాపహో,
వాలాగ్ని మథితానేక లంకావాసి గృహోచ్చయః.
వర్ధనో వర్ధమానశ్చ రోచిష్ణూ రోమశో మహాన్,
మహాదంష్ట్రో మహాశూర స్సద్గతి స్సత్పరాయణః.

సౌమ్యదర్శీ సౌమ్యవేషో హేమ యజ్ఞోపవీతిమాన్,
మౌంజీ కృష్ణాజిన ధరో మంత్రజ్ఞో మంత్రసారధిః.
జితారాతి షడూర్మిశ్చ సర్వప్రియ హితేరతః,
ఏతై ర్నామపదై ర్దివ్యై ర్య స్తౌతి తవ సన్నిధౌ.
హనుమం స్తస్య కిన్నామ నోభవే ద్భక్తి శాలినః,
ప్రణవంచ పురస్కృత్య చతుర్థ్యంతై ర్నమోంతకై.
ఏతై ర్నామభి రవ్యగ్రై రుచ్యతే హనుమాన్ భవాన్,
వ్రణరోగాది దారిద్ర్యం పాపక్షు దపమృత్యవః.
వినశ్యంతి హనూమం స్తే నామ్నాం సంకీర్తన క్షణే,
భగవన్ హనుమన్నిత్యం రాజవశ్యం తథా సతామ్.
లక్ష్మీ వశ్యంచ స్త్రీ వశ్యం ఆరోగ్యం ధైర్య్య మాయుషః.
ప్రాధాన్యం సకలానాం చ జ్ఞాతి ప్రాధాన్య మేవచ,
వీర్యం తేజశ్చ భక్తానాం ప్రయచ్ఛసి మహామతే.

ఈ స్తోత్రమును విన్న హనుమంతుడు "ఓ మునీ! నీ స్తోత్రముతో నేను సంతుష్టుడనైతిని. ఈ స్తోత్రము పఠించినవాడు ఏబాధలు లేక నా అనుగ్రహమువలన వరములను పొందగలడు. ఈ స్తోత్రముతో కౌండిన్యుడు నన్ను సేవించి పుత్రసంపదను పొందెను. దీనిని చదివిన వారికి పిరికితనము తొలగిపోవును. అమితధైర్యము కలుగును. ఇంద్రియ నిగ్రహము కలుగును. ఆయురారోగ్య ఐశ్వర్యములు కలుగు"నని చెప్పెను. మహా సంతోషముతో ఔద్దాలికుడు "స్వామీ! నాకు నీయందు అచంచలమైన భక్తి యుండుగాక. ఎల్లప్పుడు నాపై దయ జూపుము. ఈ తీర్థమును చక్రముతో పవిత్రము చేయుము. దీనికి చక్రతీర్థము పేరు కలుగుగాక." అని ప్రార్థించెను. అప్పుడు ఆంజనేయుడు బ్రహ్మర్షుల ప్రీతికై చక్రమును నీటిలో త్రిప్పి ఔద్దాలికునకు వరము లొసగి స్వస్థానమునకు వెళ్ళెను. ఈచక్రపుష్కరిణిలో స్నానము చేసినవారు సర్వపాప విముక్తులగుదురు. ఈ అధ్యాయమును చదివినను విన్నను ధన్యులయ్యెదరు.

## ఇరువది ఒకటవ అధ్యాయము

బ్రహ్మ ఇట్లనెను. ఈవిధముగా వశిష్ఠునిచే కథల ద్వారా బోధింపబడిన ఇంద్రద్యుమ్నుడు మిక్కిలి సంతసించెను. ఘటికాచలము నధిరోహించి మునులతో కూడ శంఖచక్రతీర్థముల స్నానము చేసెను. దేవతలు పితరులు తృప్తిపడిరి. ఇంద్ర

ద్యుమ్నుడు వశిష్ఠునితో కలసి దక్షిణ శృంగము నెక్కెను. అచట బంగారపు గీతవలె శిఖరము కనిపించెను. అప్పుడు ఇంద్రద్యుమ్నుడు ఇట్లు ప్రశ్నించెను. "ఓమహర్షీ! హేమకోటి అను పద్మమునకు బంగారపు తామరతూడువలె ఈరేఖ అగుపించుచున్నది. ఏమి ఆశ్చర్యము!" వశిష్ఠుడిట్లు తెలిపెను. "పూర్వము మానస సరోవర నివాసియైన ఒక రాజహంస ఆ తామర తూడును నోటితో కరచుకొని ఆకాశ మార్గమున బ్రహ్మ సమీపమునకు వెళ్ళెను. అచ్చట దాని నోటినుండి జారిన తామర తూడు ఘటికాచలమున తీగవలెపడెను. నృసింహ ప్రభావముతో అది బంగారు తామరతూడుగా మారెను. హంసదానిని మరల గ్రహించుటకై ప్రయత్నించి అశక్తురాలై నృసింహుని ఇట్లు స్తోత్రము చేసెను.

దేవదేవ జగన్నాథ కృపాళో భక్తవత్సల,
ప్రసాదం కురుమే క్షిప్రం ఘటికాచల నాయక.
హేమకోటి పదాధ్యక్ష హృదయానంద కేశవ,
భగవన్ భవరోగఘ్న నమస్తే నృహరే హరే.
నామరూపాత్మనా విశ్వం విభజ్య పరిపాల్యతే,
సృజ్యతే నీయతే యేన నమస్తే నృహరే హరే.
యస్యాజ్ఞా మవలం బ్యైష వాయుపుత్రో చతుర్భుజః,
శంఖచక్రధరో హ్యాస్తే నమస్తే నృహరే హరే.
ప్రహ్లాద భక్తవరద వామదేవాది ముక్తిద,
సప్తర్షి ప్రియ సర్వేశ నమస్తే నృహరే హరే.
సంసారవైరీ దైత్యారి ర్దంష్ట్రీ భీమపరాక్రమః,
ఆ పాతాళ నభోవాసీ నమస్తే నృహరే హరే.
సిద్ధ్యంతి సిద్ధయో యస్మా త్సర్వరూపా త్సహస్రశః,
వేదాశ్చ భూతయ స్సర్వా నమస్తే నృహరే హరే.
విశ్వస్యే శానమపి యం మతీనాం పురుషర్షభః,
సంగిరంతే ఘృణాపూర్ణా నమస్తే నృహరే హరే.

ఈ స్తోత్రమును విన్న భగవంతుడు "ఓ హంసరాజమా! తామరతూడు తప్ప ఏ వరమునైన కోరుకొనుము. ఈ తామరతూడు హిరణ్యకశిపుని పేగువలె శోభాయమానముగా ఉన్నది." అనెను. హంస "స్వామీ నే చేసిన ఈ సేవ చాల స్వల్పమైనది. బ్రహ్మ నివసించు పద్మము నీ నాభినుండి పుట్టినది. నాభాగ్యము

ఫలించినది." అనెను. నృసింహుడు "హంసరాజమా! నీవు బ్రహ్మకు ఇష్టమైన దాని వయ్యెదవు. అన్ని వాహనములకంటె నీ వాహనము అతని కిష్టము కాగలదు." అని చెప్పి అంతర్ధాన మందెను. అది మొదలు యుగభేదము చేత ఈ నాళము ఈ శిఖరమునకు వేరువేరు రంగులతో అగుపించును. ఈ పర్వతము హేమనాళముచే ప్రకాశింపబడుచున్నదై హిరణ్యకశిపుని పేగులు నృసింహునికి అలంకారమైనట్లున్నది. ఈ నాళమును ఎవడు చూడగలడో వాడు పుత్ర సంపదను, దీర్ఘాయువును పొందగలడు. ఇచ్చట శ్రద్ధతో హంస నుద్దేశించి బలి నొసగిన వారు "హగ్ం సశ్శు చిషత్" అను మంత్రము మూడుసార్లు జపించి బలి నిచ్చినవారు పాప విముక్తులై సుఖసంతోషముల బడయగలరు." ఈ మాటలువిన్న రాజు మిక్కిలి శ్రద్ధతో బంగారు తామర తూడు వద్ద బలి నొసగెను. హంస తీర్థమున స్నానము చేసి దక్షిణ దిక్కున ఉన్న హేమకోటిని దర్శించెను. తరువాత తూర్పుదిక్కు హేమకోటి విమానమున నున్న నృసింహుని దర్శించి నమస్కరించి స్తోత్రము చేసెను.

**యద్ద్వారాధిప చాటుకాన సరణిః ప్రార్థ్యావిరించాదిభి**
**శ్చిన్వన్తి శ్రుతయో హ్యలబ్ధ విషయా శ్చిద్రూప మద్యాపియమ్,**
**సత్వం లోచనగోచరో భవసి య త్తత్కాక తాళీయ క**
**న్యాయోదాహరణైకకా నరహరే లక్ష్మీపతే తే వయమ్ ॥**
**లక్ష్మీ మహీకర సరోజ సుధావ మర్ద । లీలావహౌ నరహరే ఘటికాద్రినాథ ।**
**ఉల్లాసినౌ చరణ పల్లవ తల్లజౌతే । సంలాలితౌ సమవలోక్య భవామ ధన్యాః ॥**
**యోనంతరూపో ఖిల విశ్వ మేత। ద్బిభర్తి సత్వం నృహరే రమేశ ।**
**త్వ మక్షరం తం సవితుర్వరేణ్యం। యతః ప్రసూతిః ప్రసృతా పురాణీ ॥**
**శాస్తా జనానాంచ తథానియంతా। తథావిస్రష్టా భగవన్ మహాత్మా ।**
**త్రిమూర్తి రూపోసి గుణత్రయీాకః । త్వ మేక ఏవాత్ర పరం నృసింహ ॥**
**అస్మాదృశో భూమితలే నృకేసరిన్। పదం పరంత్వా మవమత్య దుర్మతిః ।**
**వృతోజగ త్స్యందన సింధుజన్మభి । స్వధర్మతా దామగతో నృపాధమః ॥**
**విభ్రాంత చిత్తా భవదేక మాయయా। వరాసనస్థా వయ మిత్యశంకయా ।**
**నిగర్వ భాజో నివసం త్యహం కృతః। స్వల్పక్షయా సంగతయో నరాః పదే ॥**
**త్వయి స్థితే దాతరి మానవాద్యహం। వరేణ్యతా తేన హరౌ సదాహరౌ ।**
**దాతృభ్రమా దన్య ముపాసతేజనాః। ప్రమూఢచిత్తాః ప్రమదాను సంగినః ॥**
**భుక్తించ ముక్తిం భవదంఘ్రి సేవినాం। దదాసి విష్ణో నృహరే త్వమేవహి ।**
**న తేతరాణా మవివేక శాలినాం। వృథా శుకానా మివ నిష్ఫల ద్రుమః ॥**

స్వతంత్ర భావేన సనాతనో భవా। న్విముక్తయే సర్వనృణాం ప్రకల్ప్యతే ।
ఉతామృతేతి శ్రుతిరాహ తత్రవై। ప్రమాణ మవ్యాజ ఘృణాచహి ప్రభో ॥
మహానుభావో భగవాన్ నృసింహ లోకత్రయే హ్యప్రతిమ ప్రభావ ।
ప్రహ్లాదసే పాదసరోజ భాజో। ప్రహ్లాద నాహ్లాద కర స్త్వమేవ ॥
పరాత్పరం వస్తుపుమా న్పురాణ। స్త్యా కారణం కారణ కారణం గురుః ।
సతాం గతిస్త్వం నరసింహ పచ్ఛో। వ్యాకుర్వతే నాన్య ఇతి శ్రుతిశ్చ॥
అనింద్యమేకం పరమం మహాంత। మాదిత్యవర్ణం తమసః పరస్తాత్ ।
త్వామేవ విద్వానమృతత్వ మేతి । దురాప మన్యామర సంగిలోకైః ॥
సత్యంచ దివ్యామిత ధారితం హరే । బ్రహ్మణ మే వార్యమణం తథా విధమ్
దూర్వాదళ శ్యామల పీత వాససం । తథా నృసింహప్రియ శంకరార్చితమ్ ॥
కిరీటినం హేమ విమాన మధ్యగం । జానుద్వయ న్యస్త కరాంబుజద్వయమ్
గృహీత శంఖారి భుజా సుదంష్ట్రిణం। నృసింహరూపం భగవంత మాశ్రయే ॥
శ్రీవత్సచిహ్నం జయశాలి నందకం। శ్రియానుషక్తం గళశోభి కౌస్తుభమ్
కౌమోదకీ లక్ష్మణ మాశ్రయే సదా। గళాదధోమర్త్య వపుర్ధరం హరిమ్
త్వ ద్యోగనిద్రా జగతాం ప్రబోధినీ। శివాసతీ శుంభ నిశుంభ రోధినీ ।
సరస్వతీ శ్రీరీతి నామభి స్సదా। ప్రకీర్త్యతే శ్రీనృహరే త్వదాజ్ఞయా ॥
త్వం వై హిరణ్యాక్ష ముఖామరద్రుహాం। హంతా గళాదూర్ధ్వ మృగేంద్ర రూపః
రౌద్రాకృతిస్తే భగవన్ నతానాం। సౌమ్యా కిమీదృ గ్విధయా ప్రవేశితా
నమస్తే పరస్మై నమో విశ్వకర్త్రే। నమో విశ్వగోప్త్రే నమో విశ్వనేత్రే ।
నమో భక్తిదాత్రే నమో దుష్టశాస్త్రే। నమోవేదవేత్రే నమోవేద ప్రోక్తే ॥
నమస్తే నృసింహాయ విశ్వప్రియాయ నమస్తే హేమకోటి విమానా నుగాయః
నమస్తే నీలవేద్యాచల శ్యామలాయ। నమస్తే నమస్తే నమస్తే నమస్తే ॥

ఇట్లు స్తుతింపబడిన నృసింహస్వామి ఇట్లనెను. "మిక్కిలి భక్తిపరాయణుడై ఈరాజు బ్రాహ్మణ్యము పొందుగాక. ఈ విష్ణుభక్తుడు అగస్త్యుడు మొదల ఋషులకంటె గొప్పవాడు. బ్రహ్మర్షిత్వము పొందుగాక." వశిష్ఠుడిట్లనెను. "ప్రభ అనన్య సులభమైన విష్ణుభక్తిని ఇతని కిచ్చితివి. ప్రజలందరిని చల్లగా చూచితివి. ఈ రాజునకు దుర్లభమైన బ్రహ్మర్షి పదము నిచ్చితివి. ఓ భక్త రక్షకా! భక్తులను రక్షింపువ

దీనులపై మీ కృపామృతరసము వర్షింపుము." అని ప్రార్థించెను. ఇట్లు తెలిపిన బ్రహ్మ మరల ఇట్లనెను. "అట్లు నిరుపమానమైన నృసింహుని కటాక్షముతో బ్రహ్మతేజస్సును ఆ రాజు పొందెను. పరమపదమైన వైష్ణవ స్థానము పొందెను. సాలోక్యముక్తిని పొంది శ్రీనృసింహుని సేవించుచున్నాడు."

# ఇరువది రెండవ అధ్యాయము

బ్రహ్మచెప్పిన కథలను విని ఋషులు సంతసించిరి. వారిట్లనిరి. "ఓ పితామహా! ఘటికాచల మాహాత్మ్యము కథలను విని ధన్యులమైతిమి. మీరు చెప్పిన ఈ మాహాత్మ్యము జయావహమైనది. లక్ష్మీకరమైనది. దీనిని చదివినవారు, విన్నవారు, వ్రాసినవారు, పూజించినవారు నృసింహుని కటాక్షమును బడయగలరు. విప్రశేఖరుడు తన పితరుల ఉద్ధరించెనుకదా? ఏ తపస్సుతో ఆ నృసింహుని అనుగ్రహమును పొందెనో తెలుపుము" అని ప్రశ్నించిరి. బ్రహ్మ ఇట్లనెను. "స్వాయంభువ మన్వంతరమున కృతయుగమున మూడవపాదములో తన జన్మనక్షత్రము నందు వైశాఖశుద్ధ పూర్ణిమయందు సంధ్యాకాలమున ప్రహ్లాదుని ప్రీతికై యోగ నరసింహ స్వామి ఆవిర్భవించెను. వామదేవాది మహర్షులను అనుగ్రహించుటకై నృసింహుడు హేమకోటి విమానము నిలచెను. ఒక్క ఘడియ కాలమిచ్చట తపము చేసిన ఫలము లభించుట వలన ఇది ఘటికాచలమైనది. ఇచ్చట వామదేవుడు తపమొనరించెను. ఇచ్చటనే విఖనుడను మహర్షి పుట్టెను. ఖననము అనగా పాపము. దానిని ఇతని సంతతి వారు పోగొట్టువారు గనుక వీరికి వైఖానసులను పేరు కలిగినది. వీరు హరిసేవకై పుట్టిరి. భగవంతుడైన నృహరి వారికి తన సేవాభాగ్యము అనుగ్రహించెను.

ఇది బ్రహ్మకైవర్తమున ఉత్తరఖండమున భృగు పరాశర సంవాదమున ఘటికాచల మాహాత్మ్యము

సంపూర్ణము

**శ్లో॥ సుధావల్లీ పరిష్వంగ సురభీకృత వక్షసే,**
**ఘటికాద్రినివాసాయ శ్రీనృసింహాయ మంగళమ్.**



# శ్రీ నృసింహ అష్టోత్తర శతనామావళి

ఓం నరసింహాయ నమః

ఓం మహా సింహాయ నమః

ఓం దివ్యసింహాయ నమః

ఓం మహా బలాయ నమః

ఓం ఉగ్ర సింహాయ నమః

ఓం మహాదేవాయనమః

ఓం స్తంభజాయ నమః

ఓం ఉగ్ర లోచనాయ నమః

ఓం రౌద్రాయ నమః

ఓం సర్వాద్భుతాయ నమః 10

ఓం శ్రీమద్యోగా నందాయ నమః

ఓం త్రివిక్రమాయ నమః

ఓం హరయే నమః

ఓం కోలాహలాయ నమః

ఓం చక్రిణే నమః

ఓం విజయాయ నమః

ఓం జయవర్ధనాయ నమః

ఓం పంచాననాయ నమః

ఓం పరబ్రహ్మణే నమః

ఓం అఘోరాయ నమః 20

ఓం ఘోర విక్రమాయ నమః

ఓం జ్వలన్ ముఖాయ నమః

ఓం జ్వాలా మాలినే నమః

ఓం మహాజ్వాలాయ నమః

ఓం మహాప్రభవే నమః

ఓం నిటలాక్షాయ నమః

ఓం సహస్రాక్షాయ నమః

ఓం దుర్ని రీక్ష్యాయ నమః

ఓం ప్రతాపనాయ నమః

ఓం మహా దంష్ట్రాయుధాయ నమః 30

ఓం ప్రాజ్ఞాయ నమః

ఓం చండకోపినే నమః

ఓం సదా శివాయ నమః

ఓం హిరణ్యా కశిపు ధ్వంసినే నమః

ఓం దైత్య దానవ భంజనాయ నమః

ఓం గుణ భద్రాయ నమః

ఓం మహాభద్రాయ నమః

ఓం బలభద్రాయ నమః

ఓం సుభద్రదాయ నమః

ఓం కరాళాయ నమః 40

ఓం వికరాళాయ నమః

ఓం వికర్త్రే నమః

ఓం సర్వకర్తృకాయ నమః

ఓం శింశుమారాయ నమః

ఓం త్రిలోకాత్మనే నమః

ఓం ఈశాయ నమః

ఓం సర్వేశ్వరాయ నమః

ఓం విభవే నమః

ఓం భైరవాడంబరాయ నమః

ఓం దివ్యాయ నమః 50

ఓం అచ్యుతాయ నమః

ఓం కవయే నమః

ఓం మాధవాయ నమః

ఓం అధోక్ష జాయ నమః

ఓం అక్షరాయ నమః

ఓం శర్వాయ నమః

ఓం వనమాలినే నమః
ఓం వరప్రదాయ నమః
ఓం ఏశ్వంభరాయ నమః
ఓం అద్భుతాయ నమః 60
ఓం భవ్యాయ నమః
ఓం శ్రీ విష్ణవే నమః
ఓం పురుషోత్తమాయ నమః
ఓం అనఘాస్త్రాయ నమః
ఓం నఖాస్త్రాయ నమః
ఓం సూర్యజ్యోతిషే నమః
ఓం సురేశ్వరాయ నమః
ఓం సహస్రబాహవే నమః
ఓం సర్వజ్ఞాయ నమః
ఓం సర్వసిద్ధి ప్రదాయకాయ నమః 70
ఓం వజ్ర దంష్ట్రాయ నమః
ఓం వజ్ర నఖాయ నమః
ఓం మహానందాయ నమః
ఓం పరంతపాయ నమః
ఓం సర్వ మంత్రైక రూపాయ నమః
ఓం సర్వయంత్ర విదారణాయ నమః
ఓం సర్వతంత్రాత్మికాయ నమః
ఓం అవ్యక్తాయ నమః
ఓం సువ్యక్తాయ నమః
ఓం భక్త వత్సలాయ నమః 80
ఓం వైశాఖ శుక్ల భూతోత్థాయ నమః
ఓం శరణాగత వత్సలాయ నమః
ఓం ఉదారకీర్తయే నమః
ఓం పుణ్యాత్మనే నమః
ఓం మహాత్మనే నమః
ఓం చండ విక్రమాయ నమః
ఓం వేదత్రయ ప్రపూజ్యాయ నమః
ఓం భగవతే నమః
ఓం పరమేశ్వరాయ నమః
ఓం శ్రీ వత్సాంకాయ నమః 90
ఓం శ్రీనివాసాయ నమః
ఓం జగద్వ్యాపినే నమః
ఓం జగన్మయాయ నమః
ఓం జగత్పాలాయ నమః
ఓం జగన్నాథాయ నమః
ఓం మహాకాయాయ నమః
ఓం ద్విరూప భృతే నమః
ఓం పరమాత్మనే నమః
ఓం పరంజ్యోతిషే మనమః
ఓం నిర్గుణాయ నమః 100
ఓం నృకేసరిణే నమః
ఓం పరతత్త్వాయ నమః
ఓం పరం ధామనే నమః
ఓం సచ్చిదానంద విగ్రహాయ నమః
ఓం లక్ష్మీ నృసింహాయ నమః
ఓం సర్వాత్మనే నమః
ఓం ధీరాయ నమః
ఓం ప్రహ్లాదపాలకాయ నమః 108
ఓం ఘటికాచల యోగ నృసింహాయ నమః